# భవబంధాలు

(సాంఘిక నాటకము)

రచన

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు
బాపట్ల (గుంటూరు జిల్లా)

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# భవబంధాలు

వేణు అనే యువకుని జీవితపరిణామం దీన్లో కధావస్తువు. అనేకమంది బీద యువకుల జీవితంలాగే వేణు జీవితం ప్రారంభమవుతుంది. జీవితంలో నిమ్నోన్నతాలన్నీ అతనూ అనుభవిస్తాడు. ఒకవిధంగా ఆధ్యాత్మికపరివర్తన జెంది అతను భవబంధవిముక్తుడౌతాడు. భార్య మరణించినప్పుడు తక్కిన జీవితమంతా సంపూర్ణాంధకారంగా కనిపిస్తుంది. సాముద్రికపు తాత చెప్పిన దుఃఖోపశమనవాక్యాలు ఆధారంగా తన సంస్కృతి వృద్ధిచేసుకొని చివరకు విధికృతమైన పుత్రమరణ దుఃఖాన్ని దిగమ్రింగుకోగలుగుతాడు. అటు సాముద్రికపు తాత-చిన్నప్పు డెప్పుడో సర్వం త్యజించి నిజదారాపుత్రుల్ని ఒదిలి దేశాటనం చేస్తూ రేపటి పొట్టత్రిప్పట సంగతి కూడా యివ్వాళ ఆలోచించని వైరాగి - పద్మ చనిపోయినప్పుడు వేదాంత మంతా వేణుకు బోధించిన వేదాంతి. తన చేతులమీద పెరిగి పెద్దవాడైన ప్రసాదు మీద మమకారం పెంచుకుని ప్రసాదు మరణించినపుడు తన సర్వస్వం గోలుపోయినట్లు దుఃఖిస్తాడు. "వైరాగ్యం పెంపొందించుకుంటేనే చాలదు—నిలచి వుండేటట్లు చూసుకోవటంలో మరింత జాగ్రత్తపడాలి గదా!"

ఇక రాజగోపాలం ఒక సామాన్యపు తండ్రి. దుఃఖంవస్తే దుఃఖిస్తాడు. సంతోషం వస్తే సంతోషిస్తాడు. ఈ ముగ్గురి పాత్ర చిత్రణ ఈ నాటక కథావస్తువు.

రసహృదయం ఈ నాటకాన్ని సహృదయంతో ఆదరిస్తుందని ఆశిస్తున్నాను.

గంగాధరం.

# పాత్రలు

వేణునాథం—యువకుడు. కొద్దిచదువుతో చాలించి ప్రయివేట్లు చెప్పి పొట్ట పోసుకుంటున్నాడు.

సాముద్రికుడు—దేశసంచారం చేస్తూ సాముద్రికం చెప్పి పొట్టపోసుకునే ఒక వృద్ధుడు.

రాజగోపాలం—వేణు పొరుగింటి ధనవంతుడు.

మనోహరం—రాజగోపాలం కొడుకు.

కమలాకరం
ముకుందం } మనోహరం. వేణులకు బాల్యస్నేహితులు.

ప్రసాద్—వేణు కొడుకు.

పురోహితుడు—మరికొందరు కుర్రాళ్లు.

పద్మ—రాజగోపాలం కుమార్తె.

కళావతి—వేణునాథం చెల్లెలు, పద్మ సహాధ్యాయిని.

# భవబంధాలు

## మొదటి రంగము

[వేణునాదం అనే వక బీద ప్రయివేటు మాష్టరు ఇంట్లో మధ్యసావడి. వెనకవైపు ఇంటి ముఖద్వారం, దానికి రెండువైపులా రెండు కిటికీలు వున్నాయి. గదికి రెండు వైపులా మరి రెండు ద్వారాలున్నాయి. ఒకటి లోపల గదులకు దోవ. రెండవది మరో గదికి దోవ. రంగం మీద ఎడమప్రక్క కిటికీముందు పడక కుర్చీలో వేణునాధం కూర్చుని యిద్దరాడ పిల్లలకు ప్రయివేటు పాఠం చెప్తున్నాడు. ఆడపిల్లలిద్దరూ చాప మీద కూర్చుని వున్నారు. రంగం కుడిప్రక్క కిటికీ దగ్గర వక చిన్న టేబుల్. దానికిడ్రాయర్- రెండు కుర్చీలూ వున్నాయి. ఇవిగాక గది అంతా సామాన్యపు పటాలూ మొదలైన వాటితో అలంకరించబడి వుంటుంది. తెర లేచేసరికి పాఠం చెప్పించుకుంటున్న ఆడపిల్లలిద్దరూ పాఠ్యపుస్తకంలో వున్న ఒకశ్లోకం సంగీతయుక్తంగా చదువుకుంటూరారు.]

కళావతి- | బ్రహ్మణ్యాధాయ కర్మాణిసజ్గంత్యక్త్వాకరోతి యః
పద్మ- | లిప్యతే న సపాపేన పద్మపత్ర మి వాంభసా.

వేణు—"పద్మ పత్ర మివాంభసా". అంత తేలికా అని...?
ఊఁ...సరే. ఈ శ్లోకం అసలు భగవద్గీతలోది "ఆసక్తి

విడిచి పరమాత్మ మీాదే భారంవేసి ఎవడు సమస్త కర్మ లను చేస్తూవుంటాండో, వాడు తామరాకును నీటి బొట్టు అంటని మాదిరిగా పాపములచేత అంటబడడు'' అని అర్థం. ప్రపంచంలో తాను చేయవల్సిన పనులు ప్రతి ఫలాపేక్ష లేకుండా చేస్తుంటే ఈ పాపాలు వాడిని అం టవు. అంటే వాటివల్ల బాధ పడడు, అన్నమాట. తామరాకు...నీటిబొట్టూలాగా ప్రపంచంలో ప్రవర్తిస్తే బాగానే వుంటుంది. కాని సామాన్యమానవుల కది సాధ్యమా? సరే ఇవాల్టికి పాఠం ఆపేద్దామా?

కళా—ఆ...చాల్లెద్దూ. తలనొప్పి పెడుతుంది.

పద్మ—అప్పుడేనా! గంటన్నా కాలేదు మొదలెట్టి?

కళా—నీ కల్లాగే వుంటుంది లే. అది సరేరా, అన్నయ్యా! మరి, ఇవ్వాళ సినిమాకి వెళ్ళవద్దూ?

వేణు—సినిమాకి వెళ్ళాలా!

కళా—వెళ్ళొద్దూ? వెళ్ళి వారం రోజులయింది! ఇవ్వాళ మంచి సినిమాట్రా "ప్రేమకోసం" అని; నువు మనో హరంతో వెళ్తాను.

పద—మనోహరం అన్నయ్యతోనా! అన్నయ్య సినిమాకం కెళ్తావని చెప్పాడా?

కళా—ఆ, చెప్పాడు. నన్నూ తీసుకువెళ్తానన్నాడు.

పద్మ—నాతో చెప్పలేదే!

కళా—ఏమోలే! ఏరా అన్నయ్యా! వెళ్తావ్రా సినిమాకి,

వేణు— వెళ్ళాగానిలే.

కళా—మరి డబ్బులేవో? రూపాయి కావాలి! మనోహరం కుర్చీకి వెళ్ళాడు.

వేణు—అయితే రూపాయి కావాలన్నమాట.

కళా—ఆ...రూపాయేగా!

వేణు—రూపాయేగా! రూపాయంటే నీకు ఎంత తేలిగ్గా వుంది?

కళా—పోన్లే అయితే! ఇంట్లోనే పడివుంటాను ఎక్కడికి వెళ్ళకుండా. (కోపంగా గబగబా వెళ్ళిపోతుంది)

పద్మ—ఈ మాత్రానికే అంత కోపం ఎందుకూ?

వేణు—బ్రతికున్న దరిద్రుడికి చెల్లెలైనందుకు.

పద్మ—అబ్బ! అంతమాట ఎందుకంటారు, ఇంతమాత్రానికి?

వేణు—అవును, దరిద్రంలోనే కోపం ఎక్కువ.

పద్మ—అట్లా అయిపోయారేం? ఇప్పుడేగా చెప్పారు "పద్మ పత్ర మివాంభసా" అని.

వేణు—"పద్మపత్రమివాంభసా"! అప్పులవాళ్లు నెత్తిమీద తంతుంటే, ఏరోజుకారోజు ఎట్లా గడుస్తుందా అని బాధ పడ్తుంటే, "పద్మపత్రమివాంభసా"అని ముక్కుమూసుకో మంటావా? ఈ జీవితం మాబోటి దరిద్రులకి కాదు, పద్మా, మీబోటి గొప్పవారికి. అబ్బా! (తలనొప్పిలాగ తల పట్టుకుంటాడు.)

పద్మ—ఏం! అలా తలపట్టుకుంటున్నారేం?

వేణు—మరొకరికాళ్లు పట్టుకోలేక.

పద్మ—అదేమిటండీ!

వేణు—అవును. దానికి రూపాయి ఇవ్వటానికి వెనక్కి తీశాను. కాని ఈ రూపాయి వుంటే రేపు వెళ్ళమార్చు తుంది. కనకనా! దానికిచ్చినా పొయ్యేది--సంతోషించేది.

పద్మ—రేపు మా నాన్ననడిగి జీతం ముందుగా తెచ్చి యిస్తా లెండి, రేపటికోసం బాధపడకండి.

వేణు—హు, అల్లా ఎప్పటికప్పుడు ఎవరో ఒకరు ఆదుకుం టుంటే, ''పద్మపత్రమివాంభసా'' బాగానే వుంటుంది. కాని అంతేనా యీ జీవితం? ఏదో పదిప్రవేటులు చెప్పు కుని, పొట్టపోసుకుంటున్నాం. ఎల్లాగో అల్లా బ్రతకలేక పోం అనుకో, కాని కళ దాని తోవన అది అత్తవారింటికి వెళ్ళితే, ఆతర్వాత? ఈఅరచేతిలో ఎలారాశిపెట్టివుందో, (అరచెయ్యి చూచుకుంటాడు.)

పద్మ—రాశిపెట్టున్నట్లవుతుంది. మనం అనుకుంటే మాను తుందా.

వేణు—మానదు; కాని నీకు తెలియదు పద్మా, జన్మ తిండి తిని నిద్రపోవటానిక్కాదు.

[ఒక కంఠస్వరం బయటనుంచి వినిపిస్తుంది. అయ్యా! సాముద్రి కుణ్ణి. చెయ్యిచూచి చదివినట్లు చెప్పగలను బాబూ]

వేణు—సాముద్రికులా! రండి, స్వామీ, లోపలికి రండి.

సా—(మధ్యద్వారంద్వారా లోపలికివచ్చి) చెయ్యి చూ పించుకొంటారా బాబూ?

వేణు—ఆ, ఈచేతి పిచ్చిగీతల్లో ఏ పరమరహస్యాలు ఇరుకునని బాధపడుతున్నారో! వచ్చి, చెప్పండి.

సా—చెప్తా, బాబూ చెప్తా, ఉన్నదున్నట్లుగాచూసి చదివినట్లు చెప్తా.

వేణు—ఆ, చెప్పండి. ఇటువంటి హస్తం మీరెప్పుడూ చూచి వుండరు. (చెయ్యిచూపిస్తాడు)

సా—(చెయ్యి చూస్తూ) నిజమే! ఇటువంటి చేతి నిదివరకు చూడలా!...ఇన్ని మంచి రేఖలుండీ ఒక్కటీ రాణించక పోవటం చాలా విచిత్రమే! ఆ, మీతల్లిగారు ఏడాదిక్రింద మరణించారు.

వేణు—రెండుమాసాలు తేడా, అంతే.

సా—తండ్రి చాలా చిన్నప్పుడే మరణించారు. అంటే, పథ్నాలుగేళ్ళక్రితం అయివుండాలి. అంతకుముందే మీ కొక చెల్లెలు.........

వేణు—అవును. కళ పుట్టినతర్వాత...ఆరునెలలకే ఆయన పోయారట.

సా—సామాన్య జీవితం! తెలివితేటలు బాగున్నా సామాన్య విద్యతోనే చాలించారు! వివాహం మరో సంవత్సరంలో జరుగవచ్చు. ఒక్క మగపిల్లాడు......అంతే...... తర్వాత...ఊఁ.

వేణు—చాలు చాల్లెండి. ఒక్క మగపిల్లవాడితో వెళ్ళమార్చండి చాలు.

సా—విద్యా వినయాది సుగుణాలు ఎన్నివున్నా, అసలు రేఖ మాత్రం శూన్యం.

పద్మ—అంటే ?

వేణు—సంపత్తు లే. అది లేదని ఎప్పుడో తేలిపోయింది. అక్కర్లేదులెండి......పొట్టకోసం పాపం చెయ్యకుండా వుంటే...అదే చాలు.

సా—పెళ్ళయినతర్వాత, కొంత పరిస్థితి బాగుండవచ్చు. కాని... అదీ...ఏంమంత ఐశ్వర్యాన్ని సూచించడంలేదు.

వేణు—కొంతవరకూ ఆస్తి వస్తుందంటారా ఏం ? కల్సి వచ్చేట్టయితే త్వరగా పెళ్ళిచేసుకొంటాను. ఎవతన్నా దొరుకుతుందేమో...వెతకాలి.

సా—మొత్తం మీద దురదృష్ట జాతకమే !

[మనోహరం, కమలాకరం, ముకుందం, మధ్యద్వారం గుండా హుషారుగా నవ్వుకుంటూ వస్తారు]

ముకు—ఇక్కడేదో Conference జరుగుతోందోయ్ !

కమ—కాదు. ఆయన సాముద్రికుడు లే.

మనో—సాముద్రికులా ! అయితే నాచెయ్యి చూడండి... మహాశయా ?

వేణు—ఇందండి (అని రెండుపావలాలు తీసి యివ్వబోతాడు)

సాము—ఏదో... పొట్ట తిప్పలకోసం డబ్బు తీసుకోవాల్సి వస్తోంది, బాబూ, ఒక్కపొట్ట కనక నాకింత అక్కర్లేదులే, పావలా ఇవ్వండి చాలు.

మనో—[దర్జాగా సిగిరెట్టు పీలుస్తూ సాముద్రికుడి దగ్గరకెళ్ళి జేబులోంచి పావలాతీసి మీదపడేసి చెయ్యి చాపుతాడు]

సా—(అతనివంక నిశితంగా చూసి) చెయ్యిచూడమంటారా? నేను చూడను.

మనో—ఏం? అదిగో...డబ్బు.

సా—అక్కర్లే...నాకివ్వాళ క్కావల్సింది...అర్ధరూపాయి. అది సంపాదించుకున్నా. రేపు సంగతి రేపు చూసుకుంటాగా లెండి.

ముకు—కోప్పడకండి...తాతగారూ! మావాడి సంగతంతే; పర్వాలేదూ, చెయ్యిచూడండి.

కమ—వాడిచెయ్యి చూసి చెప్పకపోతే, అది మీ దురదృష్ట మనాలి. వాడిలాంటి 'అదృష్టం గలవాడి చెయ్యి' చూసి చెప్పితే, రూపాయో రెండో దొరుకుతుంది....అంతే గాని!!

ముకు—చూడండీ...ఫరవా లేదు. వాడి సంగతులు మీరు బాగా చెపితే, మా అందరి చేతులుగూడా చూద్దురు గాని. (మనోహరం 5రూ॥ నోటుతీసి ఎదుట పెడ్తాడు)

సా—ఊ! (చెయ్యిచూసి) హు....ఊ ...భాగ్యవంతుల ఇంట్లోనే పుట్టుక. చదువు లేదు.

కమ—అదేమిటి! A B చదువుతున్నాడండీ!... B.A!...

సా—చదువంటే పరీక్షలుకాదు నాయనా. సంస్కారం.

ముకు—అది వేరే చదువు కాబోలు! మీమాట...రానిమాట్ల నిజమే లెండి,

వేణు—(నవ్వుతాడు)

సా—ఒక్కడే కొడుకు ... ఏమిటో ...చాలులెండి. మీ డబ్బు నాకక్కర లేదు.

పద్మ—ఏమండీ చెప్పండి?

సా—ఏముంది చెప్పటానికి? భవిషత్తు ఏం బాగా లేదు.

పద్మ—అంటే!

సా—భవిష్యత్తంతా వంచన...దుర్మార్గం.

(మనోహరం కోపంగా సాముద్రికుణ్ణి లెంపకాయ కొట్టాడు)

పద్మ—అన్నయ్యా!

మనో—నా భవిష్యత్తంతా ఇప్పుడు తెల్సిందా?

కమ—(కొంటెగా) ఆ... ఆ...అర్థం అయింది కూడా.

(అందరూ నవ్వుతారు. సాముద్రికుడు కళ్ళనీళ్ళు తిరిగి, తన మూట సర్దుకుని, వెళ్ళిపోతాడు.)

మనో—వెధవ, ప్రతివాడూ సాముద్రికవేత్తే ఈ రోజుల్లో.

ముకు—(ముసిముసి నవ్వులతో) ఇక మూడు రోజులుదాకా ఎవ్వరి చెయ్యీ చూడడు.

కమ—చెయ్యి రుచి బాగా తెల్సిందిలే.

వేణు—ఆ! చేతిలో వున్నదాన్ని చర్య ఋజువు చేసింది.

ముకు—అంటే?

వేణు—అంటే ఆయన చెప్పిన ప్రతి అక్షరం నిజమని తేలింది.

మనో—అయితే నేను వంచకుణ్ణీ...దుర్మార్గుణ్ణీ అంటావా?

వేణు—ఆ! వంచకుడివి, దుర్మార్గుడివి, దొంగవి.

మనో—(కోపంగా) వేణూ! (అని కొట్టబోయినట్లు లేవగా)
పద్మ—అన్నయ్యా!
వేణు—ఏం కొడతావా? (తనూ తయారవుతూ) కానీ... రా...ఎవరి బలమెక్కువో తెలుస్తుంది. మనోహరం! నీ బలం నీచేతిలో లేదు; బుర్రలోనూ లేదు; నీడబ్బులో వుంది. అంతే...
మనో—ఆ, నీచేతిలో, బుర్రలో, నాకంటే ఎక్కువ సత్తువే వుంది. కనకే పొట్ట జరగక ప్రయివేట్లు చెప్పుకుంటు న్నావ్.
పద్మ—అబ్బబ్బ! వూరుకోండి. ఎందుకొచ్చిన గొడవ?
మనో—చాల్లే నువ్వూరుకో.
ముకుం—అందరూ వూరుకోండిరా. వాడేదో వాగితే, మనం ఎందుకు దెబ్బలాడుకోవాలి?
కళ—(వచ్చి) వచ్చారా? మీరందరూ...
కమ—ఆ, వచ్చాం.
కళ—ఏరా అన్నయ్యా: సినిమారా.
ముకు—ఆగు. అసలే కోపంగా వున్నాడు.
మనో—మనం పోదాం పదండి. టైము అయింది.
కమ—ఆగు. కళ కూడా వస్తానందిగా!
కళ—ఏరా, టైం అయిందిట్రా?
ముకు—పంపుతావో...పంపవో అదన్నా చెప్పు. ఈకాల యాపనెందుకు?

కమ—జేబులో డబ్బులు లేనట్టున్నాయి. ముసరం పోదాం, రండి.
(పద్మ Drawer లో తనదగ్గరున్న అర్ధరూపాయి పడేసి ఇవతలకి వచ్చేస్తుంది.]

కళ—కాదు. ఉన్నాయిలే. ఏరా అన్నయ్యా?

వేణు—ఇంద. (జేబులోంచి తీసి పన్నెండణాలు ఇస్తాడు)

కళ—ఇది పన్నెండణాలేరా, ఖర్చికి రూపాయి కావాలి.

ముకు—అంతే వుందిలే, రా; తక్కింది మేమిస్తాంలే.

కళ—కాదు. ఉందిలే; ఏరా, మాట్లాడవే?

వేణు—కళా!

[''పద్మ యివతలకొచ్చి డబ్బు Drawer లో వుంది'' అని వేణుకి సౌంజ్ఞ చేస్తుంది. వేణు ఆ సౌంజ్ఞ అర్థంచేసుకోడు]

పద్మ—ఆ Drawer లో ఇందాక డబ్బు పడేశారుగా?

వేణు—Drawer లో డబ్బు పడేశానా!

పద్మ—ఆ, ఇందాక పడేశారుగా.

వేణు—నేను పడేశానా?...ఎక్కడిది? లేదే!

పద్మ—కాదు. చూడండి. నాచేతికిస్తే నేనే పడేశా.

వేణు—అది నిన్న పద్మా! ఇవ్వాళ అనుకుంటున్నావా యేం?

పద్మ—లేదు. ఇవ్వాళే, మర్చిపోయ్యారు కాబోలు. (వెళ్ళి తీసి చూపించి) ఇదిగో.

కళ—అమ్మయ్య...ఇయ్యి. (తీసుకొని) పదండి పోదాం.

కమ—పదండి పోదాం, సినిమాకి...

మనో—పదండి. ఆ, పద్మా! నువ్వు తొందరగా ఇంటికి పో.

పద్మ—పోతాన్లే. మధ్య నీ తొందరెందుకూ?

మనో—నాన్న త్వరగా రమ్మన్నారు. ముందు వెళ్ళు. పదండిరా.

ముకు—పద్మ రావా సినిమాకి?

మనో—రాదులే. దానికి సినిమాలక్కర్లే.

ముకు—'ప్రేమకోసం' చాలా బాగుంటుంది. రా, పద్మా.

పద్మ—నే రాను.

మనో—రండోయ్ అనవసరపు ఆలస్యం.

కమ—పదండి (అందరూ వెళ్తారు)

పద్మ—ఏమిటిది? కళ ఒంటరిగా వాళ్ళందరితో సినిమాకి బయలు దేరింది.

వేణు—దానికి సినిమాలంటే తగని పిచ్చి.

పద్మ—ఎంత పిచ్చయితే మాత్రం మగరాయడుమల్లే వాళ్ళతో వెళ్ళితే బాగుంటుందా?

వేణు—ఏదో చిన్న పిల్ల. దాని సంతృప్తి దాన్ని పడనీ; రేపు పెళ్ళి అయితే ఈ సరదాలన్నీ ఆఖరే...కాని ఇంతకూ ఆ అర్థరూపాయి అక్కడికెట్లా వచ్చింది?

పద్మ—ఏమొ!

వేణు—ఎప్పుడు పెట్టావ్, నువ్వు?

పద్మ—నే పెట్టలేదే!

వేణు—దబాయించకు. ఎప్పుడో నువ్వే పడేశావ్...నా పరువు కాపాడావు...ఏమిటో జీవితం! పగవాడికైనా యీ జీవితం వద్దురా, దేముడా! వద్దు.

పద్మ—ఎప్పుడూ అంత నిరాశగా మాట్లాడతారేం ?

వేణు—మాట్లాడటం తప్ప మరేం చేయలేక.

పద్మ—చెప్పండి. నే చేయగలిగిన సాయం చేస్తాను.

వేణు—ఏం చేస్తావ్ ?

పద్మ—ఏమైనా సరే; ఒకరికి సాయం చేయటానికంటె చేయతగ్గ దేముంది ?

వేణు—ఊఁ. . .అయితే నువ్వొ త్వరగా ఇంటికి వెళ్ళు.

పద్మ—మీరొక్కరే కూర్చుని ఏంచేస్తారు?

వేణు—ముక్కు మూసుకుని తపస్సు చేస్తాను.

పద్మ—అబ్బ; ఎప్పుడూ అట్లాగే మాట్లాడతారు!

వేణు—కాదు పద్మా! కళ సినిమాకి వెళ్ళింది. . .మరి, ఇవ్వాళ వంట నేను చేసుకోవాలిగా.

పద్మ—. . .సరే, నే చేసిపెడతాలెండి వంట.

వేణు—నువ్వా!

పద్మ—నేనే. ఏం ?

వేణు—ఏం లే. నీకు వంట చేయటంకూడావచ్చా అని ?

పద్మ—చేతనయినంతవరకూ చేస్తాను. ఆతర్వాత (నవ్వి) మీరు నేర్పుదురుగాని.

వేణు—మేష్టర్ గారు పాఠాలేగాక, వంటకూడా నేర్పాల్సిందే. (ఇద్దరు నవ్వుతారు)

[వేణునాథం వేణునాథం అని బయటనుంచి పిలుపు వినిపిస్తుంది.]

వేణు—చచ్చాం రా దేముడా!

పద్మ—ఎవరది?

వేణు—శివయ్య అనుకుంటా.

పద్మ—అంటే?

వేణు—ఒక సాహుకారు లే. బాకీకోసం వచ్చాడుగాబోలు!

[లోపల్నించి. వే.ణునాథం వేణునాథం''అని కేక వినిపిస్తుంది]

పద్మ—మీరు బాకీవున్నారా.

వేణు—అదే, ఒక వందివ్వాలి. ఇవ్వాళిస్తా రమ్మన్నాను. వచ్చికూర్చున్నాడు.

పద్మ—అయితే ఇచ్చెయ్యండి.

వేణు—ఇయ్యగలిగితే ఈ ఖంగారెందుకు? వెళ్ళి, లేరని చెప్తావా? పోనీ.

పద్మ—ఛీ! అబద్ధాలాడటమా?

వేణు—ఆడవచ్చు, ఆడవచ్చు. ఇట్లాటిసమయాల్లో అబద్ధాలాడవచ్చన్నారు.

పద్మ—ఒక పనిచెయ్యండి.

వేణు—ఏదైనా తర్వాతచేద్దాం వాణ్ణిపంపిన తర్వాత...

[లోపల్నించి వేణునాథం అని కేక వినిపిస్తుంది.]

పద్మ—కాదు, నామాట సరిగ్గా వినండి.

వేణు—మాటలన్నీ తర్వాత వింటా. తలుపుతీసే వుంది. అమాంతం వాడింట్లోకొస్తే వెధవముఖంతో వాడికి స్వాగతం మివ్వాలి. ముందుపో.

పద్మ—ఇదిగో. ఈ గొలుసు తీసుకెళ్ళి మీ బాకీ తీర్చండి. (మెళ్ళో గొలుసు తీసి ఇవ్వబోతుంది.)

వేణు—ఆ. (తెల్లబోయి) ఛ... అదేం పని?

పద్మ—ఫరవాలేదు. పరాయివాడితో అబద్ధం బదులు మా నాన్నతో నిజమే చెప్తా.

వేణు—పద్మా!!

[లోపల్నించి ఎవరండీ లోపల అని పిలుపు]

పద్మ—ఏవండీ.

వేణు—వద్దు. గొలుసు మెళ్ళో నేవుంచు. ఆడదానివి, నీకే ఇంత ధైర్యం వుంటే, నాకెంతవుండాలి? అప్పులవాడే కాదు, యములాడు వచ్చినా యీ దెబ్బని ఎదురెళ్తాను. (గబగబా వెళ్ళబోగా.)

పద్మ—వెళ్తున్నారా? ఏం చెప్తారు?

వేణు—అహా! వెళ్ళటంలే. ఆగాను. ఒక సందేహ మొచ్చింది. యములాడు వక్కసారే ఎదురొస్తాడు... అప్పులవాడు రోజూవస్తే...రోజూ ఎదురు వెళ్ళాలే!... ఎట్లా అని? (లోపల్నించి,) ఎవరున్నారండీ లోపలా?

వేణు—చచ్చాం. తలుపుతీసి లోపలికి వస్తున్నట్టున్నాడు.

పద్మ—(కిటికీలోంచి చూసి) అప్పులవాడు కాదండీ!

వేణు—కాకపోతే యములాడా ఏం?

పద్మ—ఛీ! కాదు. మానాన్న (వెళ్ళి తలుపు తీస్తుంది)

వేణు—అమ్మయ్య! బ్రతికించావ్!... ఇకంతా ధైర్యమే, రండి...రండి.

[రాజగోపాలం లోపలికి వస్తాడు.]

రాజ—పొద్దుకూకినా...ఇంకా ఇంటికి రాకపోతేనూ పద్మను తీసుకెళ్దామని వచ్చా. ఇవ్వాళ ఆలస్యమయిందేమమ్మా?

పద్మ—ఏంలే! అసలే ఆలస్యంగా పాఠం ప్రారంభించాం. అందులో...ఏదో...కొత్తపాఠంకూడా చెప్తానన్నారు. అందుకనీ......(నీళ్ళు నములుతుంది)

రాజ—కొత్తపాఠమా?

పద్మ—కొత్తపాఠం... ఏదమ్మా అదీ.....ఆ...వంట... వంట......

రాజ—వంటా!... మాష్టర్ గారు వంటలుగూడా నేర్పుతారా ఏమిటి!

వేణు—వంటగాదండీ......వటోపాఖ్యానం.

రాజ—అహా! (నవ్వి) వంటయినా తప్పులేదులే. పెళ్ళి కావాల్సిన పిల్లలు వంటగూడా నేర్చుకుని వుండటం మంచిదే.

వేణు—మీ అమ్మాయి వంట ఎందుకు చేస్తుందిలెండి... హాయిగా రాణీవాసం అనుభవించాల్సిన పిల్ల.

రాజ—ఏం రాణీవాసమో? ఒక విషయం కల్సిరావటానికి లేదు. ఎన్ని సంబంధాలు వెతికినా, వకటుంటే వకటుండటంలేదు. మన ముకుందం వున్నాడే...మన మనోహరంతో తిరుగుతుంటాడు...వాడి సంబంధం ఒక మాదిరిగా వుంది. చదువూ...ఆస్తీ వుందిగాని... కేవలం మన

వాడిలాగే పోకిరీగా తిరుగుతాడు. ఏమమ్మా! నీ కిష్ట మేనా? మీామేష్టరుగారి ఎదుట అడుగుతున్నాను...... చెప్పు......మాట్లాడవేం.

వేణు—మౌనం...అర్ధాంగీకారం లెండి.

పద్మ—(తొందరగా...కోపంగా) మీారు వూరుకోండి.

వేణు—'కోపం...పూర్ణాంగీకారం' అన్నమాట.

రాజ—అదేమిటండోయ్...!!

వేణు—ఇదో కొత్త Theory లెండి. "ఆడవాళ్ళ మాటలకు అర్థాలే వేరని."

రాజ—(నవ్వి) ఆ...ఏమిటో! కొత్త Theory లు. మా కాలంలో అంతా వక్కటే Theory. మెదలకుండా పెళ్ళి చేసెయ్యటమే.

వేణు—అది పేపబెత్తం...Theory లెండి.

రాజ—(నవ్వి) ఏమిటో! ఆ Theoryయేమో కాని, మావాడిట్లా చెడిపోయేవాడా? కాస్త నువ్వన్నా చెప్పరాదుటయ్యా మీా యిద్దరికీ స్నేహంగూడాగా, నిన్న నాజేబులో వంద రూపాయిల కాగితం మాయమయింది.

వేణు—వందరూపాయలా!

రాజ—ఆ, వందరూపాయలు! ము రిదంతా ఏం చేస్తున్నాడో, ఏమో? వాళ్ళు వీళ్ళు చెప్పేమాటలు మరీఘోరంగా వున్నాయి. ఏదో B.A దాకా వచ్చాడుగదా. ఇంకా బుద్ధిరాకపోతే ఎట్లా? కాస్త కేకలేసి బుద్ధి చెప్పుదూ,

వేణు—తోటివాడికి నేనేం చెపితే బాగుంటుంది?

రాజ—ఏమిటో! ఎల్లా రాసిపెట్టివుందో! పద్మా! మరి చీకటి పడింది. ఇంటికివస్తావా. ఇంకా పాఠం, వుందా?

పద్మ—వస్తాలే, నాన్నా! పాఠంకాగానే వస్తాలే.

వేణు—పోనీ, వెళ్లుపద్మా! తక్కింది రేపు చదువుకోవచ్చులే.

[సాముద్రికుడు గబగబా వచ్చి]

సా—బాబూ! బాబూ! ఇందాక నన్ను లెంపకాయికొట్టాడే. ఆ కుర్రాడి ఇల్లెక్కడ?

వేణు—ఏం, ఎందుకు?

సా—అక్కడ రోడ్డుమీద పోలీసులతో, ఏదో వాదించాడు; వాళ్ళు ఇతన్ని పట్టుకున్నారు.

పద్మ—పట్టుకున్నారా?

రాజ—ఏవర్ని?

పద్మ—అన్నయ్యనే!!

రాజ—అన్నయ్యనా!!

సా—ఆ. నేనటువెళ్తూ చూశాను. పాపం; మీకేమవుతాడో ఏమో, చెప్పిపోదామని వచ్చా.

రాజ—ఇదెక్కడిగోల?

వేణు—పదండి. వెళ్ళి చూసివద్దాం.

రాజ—వా ళ్లెక్కడికి తీసుకెళ్ళారో!

వేణు—స్టేషనులో కనుక్కుంటే అంతా తెలుస్తుందిగా.

పద్మ—వెళ్ళిరండి, తొందరగా. నే నిక్కడే వుంటా.

వేణు—వంటరిగా వుంటావా?

పద్మ—ఫర్వాలేదు, వెళ్ళరండి.

సా—పోనీ, నేనూవుంటా. ముందు మీరు వెళ్ళండి; పాపం.

రాజ—పదండి. ఏమిటీగోల? (ఇద్దరూ వెళ్తారు)

సా—(కాసేపాగి) నువ్వా, అతనికి ఏమవుతా వమ్మాయీ?

పద్మ—ఏమవుతానూ? ఏమవను. వారిదగ్గర ప్రయివేటు చదువుకుంటున్నాను.

సా—అహా...అంతేనా!

పద్మ—పాపం- వంటన్నా చేసుకోకుండా వెళ్ళారు. తిరిగి వచ్చేసరికి ఎంత ఆలస్యమవుతుందో, ఏమో-

సా—ఏం? ఇంట్లో వంటచేసేవాళ్ళెవరూ లేరూ?

పద్మ—లేరు. ఆయనా, ఆయనచెల్లెలే. రోజూ సహాం వంట ఆయనే చేసుకుంటారు.

సా—అహా! నాకుమల్లేనే వంటరి వ్యవహారమన్నమాట!

పద్మ—తిరిగి వచ్చేసరికి, ఆలస్యం అవుతుందా అండీ?

సా—ఏమో! పోలీసులతో వ్యవహారం!

పద్మ—ఈలోగా నే వంటచేసేస్తే...?

సా—చెయ్యిపోనీ, నాదోవని నే వెళ్తా (లేచి వెళ్ళబోతూ) తలుపేసు కెళ్ళు.

పద్మ—అహాహా! ఉండండి. నే నొక్కత్తెనే వుండాలంటే భయం. అసలే పోలీసులు కళ్ళల్లో ఆడుతున్నారు.

సా—సరే పోనీ, ఉంటాలే. ఇక్కడేకూర్చుంటా,

పద్మ—నే పొయ్యిమీద గిన్నె పడేసివస్తా; (వెళ్తుంది)

(సాముద్రికుడు బల్లమీద పుస్తకం తీసి చదువుతుంటాడు)

పద్మ—(తిరిగివచ్చి) ఏమండీ, తాతగారూ!........మీ పేరేమిటో?

సా—తాతగారిది ఏ పేరయితే ఏం? తాతగారనే అను.

పద్మ—ఇద్దరికి సరిపోవాలంటే, రెండు శేర్ల బియ్యం పోస్తే చాలా?

సా—రెండు శేర్ల బియ్యమా? ఇద్దరికా!!

పద్మ—ఆ. ఇద్దరూ...(శేరు కొలపాత్ర చేత్తోపట్టుకొనివచ్చి) ఇదిగో శేరు...ఇది శేరేగా?

సా—ఆ, శేరే; కాని...వాళ్ళిద్దరూ మనుష్యులా, రాక్షసులా?

పద్మ—మనుష్యులేనండి.

సా—అయితే ఒక్క అర్ధశేరు పొయ్యి; చాలు.

పద్మ—అంతేనా! అర్ధశేరే సరిపోతుందా?

సా—ఆ గవర్నమెంటు లెక్కప్రకారమయితే, అదే చాలా ఎక్కువ.

పద్మ—అహా! సరే, అయితే...(వెళ్తుంది; ఆయన మళ్ళా చదువుకుంటూ కూర్చుంటాడు)

పద్మ—(కాసేపాగి వచ్చి) ఇక అన్నం వుడికే దాకా కూర్చోవచ్చు. శుభ్రంగా కడిగి, గిన్నెలో నిండా నీళ్ళు పోసి, కుంపటిమీద పెట్టొచ్చాను.

సా—నిండానా! ఎంతగిన్నె ?

పద్మ—ఏం! అంతగిన్నె! (చేతుల్తో చాలా పెద్దగిన్నెగా సౌంజ్ఞ చేసి చూపిస్తుంది.)

సా—బాబోయ్! అంత గిన్నె నిండా నీళ్ళుకూడా పోశావా?

పద్మ—ఆ. మా ఇంట్లో అంత గిన్నెనిండా నీళ్ళుపోసిపెడతారు.

సా—ఆ. మానెడు బియ్యానికంత గిన్నె కావాలి. గాని, అర్ధశేరుకి కాదు.

పద్మ—అది మానెడు బియ్యానికా?...అహా!!

సా—పోయి చిన్న గిన్నెలో పెట్టి రా.

పద్మ—అహా...మానెడు బియ్యానికీ (చేత్తో చూపిస్తూ) అంతగిన్నెఅయితే, అర్ధశేరు బియ్యానికి ఇంతగిన్నె Direct Proportion (అనుకుంటూ వెళ్తుంది. కాసేపయిన తర్వాత పద్మ తిరిగి వస్తుంది)

సా—నీకు వంటచాలా బాగా వచ్చునల్లే వుందే ?

పద్మ—రాదండీ. ఎప్పుడూ చేయలే (నవ్వుతుంది)

[కళ, కమలాకరం, ముకుందం బయటనుంచి వస్తారు]

పద్మ—వచ్చారేం ? ఏ మయింది ?

ముకు—మీ అన్నయ్యని పోలీసులు పట్టుకు పోయారు.

పద్మ—ఎందుకూ ?

ముకు—మీ అన్నయ్య వాళ్ళకి బాకీవున్నాట్ట అందుకూ.

కమ—ఆ బాకీ లేదు ఏం లేదు. ఆ Police Inspector స్నేహితుడి కూతురుకి వీడేదో ఉత్తరం రాశాట్ట. అందుకని.

పద్మ—ఉత్తరమా...ఛ!

కమ—ఆ. ఆ కక్ష ఏదో మనసులో వుంచుకున్నారు. అసలు సంగతి అదీ.

ముకు—మరేం గాభరాలేదులే. కాసేపుంచి వదిలేస్తారు. అంతకంటే మునిగిపోయిందేంలేదు.

సా—మతి నే వస్తానమ్మా! మీ వాళ్ళందరూ వచ్చారుగా.

పద్మ—మంచిదండీ. చాలా సాయం చేశారు. వెళ్ళిరండి. (వెళ్ళిపోతాడు)

ముకు—ఈయనెందుకు వచ్చాడూ?

కమ—ఎందుకొచ్చినా, చాలా ధైర్యంగా వచ్చాడు.

పద్మ—సాయం చేయటానికి వచ్చాడులే...ఆ అన్నం ఉడికిందేమో! చూసివస్తా.

కమ—వేణు ఏడి కళా?

కళ—ఏమో! ఇంట్లో వున్నట్టులేదు. (అందరూ తీరుబడిగా కూర్చుంటారు)

కమ—ముకుందం...మన వేణు చెప్పినా వినడు గాని కళకే గనక కాస్త సంగీతం నేర్పించి వదిత్తే లతామంగేష్కర్‌ని మించిపోతుందిరా.

ముకుం—ఎందుకూ? సంగీతం నేర్పాలేమిటి?......సినిమా వాళ్ళు...అమాంతంగా ఈపళంగా ఎత్తుకుపోరూ,

కమ—అదికాదురా. ఈ సంసారపు కట్టుబాట్లలో...పడి ఎంతమంది కళాకారులు 'కాసీ'కి పనికిరాకుండా పోతు

న్నావో చూడూ! కళ ఆపాట పాడుతుంటే ప్రాణం ఇట్లా తేలిపోతుంది.

ముకు—ఏ పాటా?

కమ—"నీకై నేటట వేచియుంటి"

ముకు—అవును.

పద్మ—(లోపల్నించి) కళా...కళా...

కళ—"నేరాను-రాను-రానంటే రాను" కూడా బాగుంటుంది.

కమ—ఆమాటకొస్తే "నీపై మోహమురా" బాగుంటుంది.

ముకు—ఏడిసినట్టుంది. అన్నిటికంటే Best... "నీ మొహమంటే వళ్లుమంట"

పద్మ—(గబగబావస్తూ) కళా, కళా!...కాస్త అన్నం ఉడికిందో...లేదో...చూసిపో.

కమ—అన్నం ఉడికిందో, లేదో, నీకు తెలియదూ?

పద్మ—తెలియదు.

కళ—ఆమెకేం తెలుసు? ఆమె గొప్పింటి ఆడబిడ్డ...

(విసుక్కుంటూ కళ పద్మతో పాటు లోపలికి వెళ్తుంది. వెళ్తున్న పద్మవంక అదేపనిగా ముకుందం చూస్తూంటాడు. అది గమనించి కమలాకరం దగ్గుతాడు. ముకుందం పలకకపోయిన తరువాత...లాభంలేదని గ్రహించి)

కమ—ఏమిట్రోయ్! నిన్నే...పలకరించేది.

ముకుం—నన్నేనా!...అహా...ఆ...పద్మ వెళ్తుంటే, చూస్తున్నాన్లే.

కమ—అవుస్లే. ఎంతవరకూ వచ్చిందేం ప్లాను ?

ముకుం—ఎంతవరకూ వచ్చేదేముంది ? వాళ్ళ నాన్న ఒప్పు కున్నట్లే. తొందరలో ముహూర్తాలు లేవుగా...

కమ—కట్నం ఎంత ?

ముకు—ఆ...ఇంకా అంబాకా రాలేమలే మాటలు.

[కళ తిరిగి వచ్చి]

కళ—ఆ పాటకంటేగూడా 'చల్ మోహనరంగా' బాగుం డదూ ?

కమ—దానికేం ? ఫస్టూ.........అందులో నీ స్టెయిల్... బలేశాగుంటుంది. ఏదీ...ఒకసారి...అను.

కళ—నువ్వు తబలా వాయించూ మరి...

కమ—ఓ...ఇదిగో...తబలా. (Table దగ్గరకు లాక్కొని కమలాకరం తబలా వాయిస్తుంటే కళ పాడుతుంది.)

కళ—చల్ మోహనరంగా నీకూ నాకూ జోడూ
కలిసెనుగదరా ॥చల్॥
నీకునాకు జోడు అయితే మల్లెపూలా తెప్పగట్టి...
తెప్పమీద తేలిపోదాం పదరా ॥చల్ మోహ॥

కమ—మళ్ళీ.............పాడు......

కళ—నీకూ నాకు జోడు అయితే మల్లెపూల
తెప్పకట్టి తెప్పమీద తేలిపోదాం పదరా.

కమ—ఇంకోసారి.

కళ—నీకు నాకూజోడు అయితే......చల్॥

[ఆ చరణమే తిరిగి, తిరిగి పాడుతుండగా మనోహరం బయటనుంచి వస్తాడు. తిరిగి తిరిగి అదే చరణం పాడించటం గమనిస్తాడు. కోపం వచ్చి]

మనో—ఏమిటిది ?

ముకు—పాట.

కళ—నీకు నాకూ జోడు అయితే

మల్లెపూల తెప్పకట్టి..........

(మనోహరం గబగబా వెళ్ళి కమలాకరాన్ని లెంపమీాద కొడతాడు. పాటఆగింది. కమలాకరం కళ్ళుతిరిగి క్రింద పడి పోతాడు)

ముకు—అరే పడిపోయాడే!

మనో—పడిపోతే బయటికి లాగిపారెయ్యండి.

[లోపల్నించి పద్మ; బయటనుంచి వేణు, రాజగోపాలం, అదే సమయానికి వస్తారు.]

పద్మ }
వేణు }— ఏమిటది ?

ముకు—మనోహరానికి కోపంవచ్చింది. కొట్టాడు.

రాజ—ఏమిట్రాయిది ?

వేణు—కమలాకరం! (కమలాకరాన్ని లేవదీస్తాడు.)

కమ—ఆ, (చెంప తడుముకుంటూ లేస్తాడు.)

రాజ—(మనోహరంతో) నీ అదరగణ్డానికి అంతులేదూ ? అక్కడ పోలీసులతో పోట్లాటూ! ఇక్కడ స్నేహితులతో కొట్లాటలూనా? ఛీ, ఛీ.

మనో—మరేం ఫర్వాలేదు లే. అక్కడ అంత అల్లరవుతుంటే నోరు పెగల్లేదుగాని, ఇక్కడకొచ్చి 'గానాబజానా' మొదలెట్టాడు, మళ్ళీ స్నేహితుడంట్రూ వెంటతిరుగుతాడు. రా, రా ముకుందం రా, పోదాం (వెళ్ళిపోతాడు)

ముకు—పద వస్తున్నా.........(వెనకనే వెళ్తాడు)

రాజ—ఇకపోదాం. పద పద్మా...వస్తామోయ్ వేణు...

(పద్మ, రాజగోపాలం వెళ్తారు)

పద్మ—(వెళ్తూ) ఆపొయ్యిమీద కూరవుంది చూడు కళా.

కళ—అల్లాగే. (లోపలికి వెళ్తుంది)

వేణు—(కమలాకరంతో) ఎల్లావుందిరా!

కమ—బాగా నేవుంది.

వేణు—దెబ్బ బాగా తగిలిందా ?

కమ—లేదు లే, కాని ... కాని ... వాడికోపం ఎందుకొచ్చిందో తెల్సా... స్నేహితుడివి గనక చెప్తున్నాను. మనోహరాన్నీ, కళనీ, కాస్తకనిపెట్టివుండు. కళను కాస్త అదుపులో వుంచు. చాలా పొద్దుపోయింది, నేనువెళ్తాను.

(కమలాకరం వెళ్తాడు) (వేణు అల్లాగే ఆలోచిస్తూ కూర్చుంటాడు)

[కళ లోపల్నించి వస్తుంది]

కళ—కూర అయింది. వడ్డించివచ్చాను. వెళ్ళి భోంచెయ్యి.

వేణు—నువ్వన్నం తినవ్ ?

కళ—తినను. ఆకలిలేదు.

వేణు—ఊ? సరే.............(వెళ్తాడు)

కళ—(Table దగ్గరకెళ్ళి కూర్చుంటుంది కాసేపయినతర్వాత బయటనుంచి "కళా, కళా" అని పిలుపు వినిపిస్తుంది)

కళ—ఎవరూ? (మనోహరం కిటికీలో కనుపిస్తాడు)

మనో—అందరూ వెళ్ళారా?......మీ అన్న ఏడీ?

కళ—భోంచేస్తున్నాడు...ఇప్పుడొచ్చావెందుకూ?

(మనోహరం గబగబా మధ్యద్వారంగుండా లోపలికివచ్చి.)

మనో—నీ సంగతేం బాగాలేదు. ఏమిటీ! వాడితో ఆట పాటలు. (రహస్యం మాట్లాడినట్లుగా అంటాడు)

కళ—నువ్వెప్పుడూ పాడమనేదేగా ?

మనో—ఏడిసినట్లుంది. ఇక ఎప్పుడూ పాడకు.

కళ—పాడవద్దా !

మనో—ఆ, నాతో స్నేహంగా వుండాలంటే పాడవద్దు. అంటే తెలిసిందా ?

కళ—ఆ.

మనో—నే వెళ్తాను. మీ అన్న మళ్ళీ వస్తాడేమో (వెళ్ళిపోతాడు)

కళ—మనోహరం !

మనో—ఏం ?

కళ—ఆ పోలీసుల్తో దెబ్బలాడేవెందుకు ?

మనో—అదో గాథలే. అదంతా ఇప్పుడెందుకూ ?

కళ—ఫర్వాలేదు. అన్నయ్యా రాడులే. చెప్పూ.

మనో——ఊఁ. తర్వాత చెప్తాలే. అదంతా చాలా వుంది.

కళ——కాదు. కమలాకరం దగ్గరపాట పాడానని నీకు కోపం వచ్చింది గదా? నువ్విట్లా ఆ అమ్మాయి కెవరికో వుత్తరాలు రాయటం బాగుందా?

మనో——అదంతా వుత్తది. ఆ పోలీస్ ఇనస్పెక్టర్ అంతా కల్పించాడు.

కళ——అయితే, నువ్వు ఉత్తరం రాయలేదంటావా?

మనో——లేదు. ఆ పోలీసువాళ్ళకీ నాకూ పడదు. అందుకని అలా రోడ్డుమీద అల్లరి చేశాడు. నామీద నమ్మకం లేదూ?

కళ——ఉంది.

మనో——ఇంకేం!

కమ——నువ్వు రాసిన ప్రేమలేఖ ఒకటి నాకు కమలాకరం తెచ్చి యిచ్చాడు.

మనో——ఆ? ఏ ఉత్తరమది?

కళ——ఇదిగో (ఉత్తరం తీసి యిస్తుంది)

మనో——ఈ ఉత్తరం నీ కిచ్చాడా! ఓరి వెధవా! నువ్వు నమ్మలేదు గదా దీన్ని...

కళ——లేదు. నమ్మలేదు. కాని ఏదో భయంగా వుంది. మనోహరం నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను. నీ కాళ్ళమీద పడి బ్రతిమాలాడుతాను. ఇక ఇట్లాంటి పని చేయనని మాట యిస్తావా?

మనో——నడిపిసట్టుంది. ఇట్లా మాట్లాడితే నాకు కోపం వస్తుంది ... ఎవరన్నావస్తే బాగుండదు. నే వస్తాను.

(వెళ్ళబోయి దర్వాజా దగ్గర ఆగి) వెళ్ళనా?

కళ—వెళ్ళిరా.

[మనోహరం బయటకు వెళ్తాడు. కళ విచారంతో Table దగ్గర కూర్చుంటుంది. వేణు ప్రవేశిస్తాడు కళ దగ్గర కెళ్ళి కళ తల చేత్తో పైకెత్తి చూస్తాడు]

వేణు—ఇదే మొదలుగా! ఇప్పుడే ఏడుపులైతే ఎట్లా! ఏడ వటానికి ఇంకా చాలా రోజులున్నాయి.

కళ—అన్నయ్యా!

వేణు—ఇంకా నా కళ్ళకి చిన్న పిల్లవుగానే కనిపిస్తున్నావ్! తల్లిలేని పిల్లవు నాపాల పడ్డావుగదా అనీ, నేల మీద నడిస్తే అరిగిపోతావనీ, తలమీద పెట్టుకుని తంటాలు పడుతున్నాను. కాని...

కళ—అన్నయ్యా.

వేణు—తెర వెనక నాటకాలాడతావనీ, తల మీద తన్ని తప్పించుకోటానికి ప్రయత్నిస్తావనీ అనుకోలేదు.

కళ—అమ్మా! (దుఃఖంతో వివశయై తలవాల్చుకుంటుంది)

వేణు—(ఆ మాటకి కోపంపోయి దుఃఖం పొంగివచ్చి) అమ్మ. అమ్మ. ఆమెను జ్ఞాపకం చేస్తావేం...అబ్బ...ఒక చచ్చిన ప్రాణికి జీవితం మీద ఇంత అధికారం ఎక్కడిది? (కొంత సేపాగి, కోలుకొని, నిమ్మదిగా) నీఖర్మనీది...నీయిష్టం వచ్చినట్టు ఏడ్చుకో. (కళ దుఃఖిస్తూ కూలపడుతుంది. వేణు వెళ్ళిపోతాడు.)

—: తెర :—

## రెండవ రంగము

అదే గది:—కొన్నాళ్ళయినతర్వాత

[పద్మ, కళ మరికొందరు పిల్లలూ కూర్చుని వున్నారు. పడకకుర్చీలో కూర్చుని వేణు పాఠం చెపుతున్నాడు.]

వేణు—అనుభవం లేక, యవ్వనంలో లేనిపోని పనులన్నీ చేస్తాం. చివరకు అంతా అనుభవించాల్సి వస్తుంది. అన్నాడు. అందుకనే షేక్‌స్పియర్ "సాహసంలో ప్రమాణాలు చేసే ప్రేమికుడు" అని వర్ణించాడు. ఏం పద్మా! ఈ వేదాంతం వింటే నీకు నిద్రవస్తున్నట్టుంది.

పద్మ—లేదు.

వేణు—మరట్లా పరధ్యానంలో వున్నావేం?

పద్మ—లేదు.

వేణు—లేకపోతే మరోలా అనుకోవాల్సివస్తుంది. పరధ్యానం కూడా ప్రేమికుల లక్షణంలే!

[అందరూ నవ్వుతారు....సాముద్రికుడు వస్తాడు]

వేణు—రండి, రండి తాతగారూ; నిన్నకూడా రాలేదు మీరు (పిల్లలతో) ఇక మన మివ్వాలికి పాఠాలు చాలిద్దాం. (కుర్రాళ్ళతో) మీరు పొండోయ్.

సా—ఏమిటీ, నవ్వులు ఒలకపోస్తున్నారు?

(పిల్లలు పుస్తకాలు సర్దుకుని నిమ్మదిగా వెళ్ళిపోతారు)

వేణు—ఏదో పాఠం సందర్భంలో లెండి. యౌవనంలో సాహసించి చేసే పనులకు మనిషి పెద్దతనంలో పశ్చాత్తాపపడ్డాడని ఏదో వచ్చి...దాని మీద నవ్వాం.

సా—నవ్వాల్సిందేం కాదే అది! బహుశా...ఏడవాల్సిందేమో.

వేణు—అదేమో! పెద్దలు మీరే చెప్పాలి!

సా—చెప్తాను. మీ చదువివ్వాలికి చాలించి నట్లయితే, చెప్తాను.

పద్మ—చెప్పండి; మేంకుండా వింటాం.

సా—నా జీవితం చితికిపోయిన తర్వాత, మళ్ళీ మనసిచ్చి మాట్లాడింది, ఈ ఆరునెలల్నించీ...మీతోనే. ఏమిటో, కొందరు కొందర్ని అల్లా ఒక్క-చోటకు లాక్కొస్తాడు... భగవానుడు, దాదాపు ముప్ఫైఅయిదు సంవత్సరాల క్రిందటి సంగతి. ఆరోజులు తల్చుకుంటే నవ్వొస్తుంది. అప్పుడు నేనేం చేసేవాణ్ణనుకుంటున్నారు?

వేణు—తప్పకుండా...ఎవర్నో ఒకర్ని ప్రేమించి వుండే వాళ్ళు.

సా—ప్రేమించాను...మనిషిని కాదు. దేశాటనాన్ని! అదో విపరీతపు ప్రేమ లే. తాశిల్‌దార్ వుద్యోగం చేస్తుండే వాణ్ణి. ఒకరోజున వెయ్యిరూపాయలు తీసుకుని ఎవరికీ చెప్పకుండా ఇంట్లోంచి వెళ్ళిపోయాను. అంతే! తిరిగి ఇంతవరకూ మావూరు వెళ్ళలేదు!

వేణు—ఏం?

నా—అదో ప్రేమ! అదో వెర్రి! ఏమిటీ...ఎందుకూ - అనే ప్రశ్న వేస్తే ప్రేమనే మాటే లేకుండా పోతుంది. ఈ ప్రశ్న యౌవనంలో రాదు. నాకు ఇన్నాళ్ళుగా రాలేదు. మొదటిసారిగా ఈ వృద్ధాప్యంలో ఆ మాట ఆరు నెలల క్రింద మనసులోకి వచ్చింది. (పద్మను చూపిస్తూ) వీళ్ళ అన్నయ్య లెంపమీద కొట్టాడే...అప్పుడు. నేను తాశిల్ దారో, మరొకటో...చేస్తుంటే ఈ లెంపకాయ తిగ లేదా అనిపించింది. తర్వాత ఇలా ఎవరో...కొడితే "ఏమిటది? ఎందుకు కొట్టావని అడిగేవాళ్ళు ఎవరూ లేరుగదా!" అనిపించింది. "రేపెప్పుడో...ఎవడో... పొడిచి చంపేస్తే...ఆశవం, 'నా'...అనేవాడు లేక, జాలి పడేవాడు లేక, కన్నీరు విడిచేవాడు లేక, తీసిపారేసివాడు లేక, అలా ఎన్నాళ్ళు ఏ చెట్టుక్రింద పడివుంటుందో" నని పించింది. పశ్చాత్తాపం ప్రారంభమయింది. దెబ్బతిన్నం దుకు కాదు. దేశాలవెంట పడినందుకు విచారపడ్డాను.

వేణు—మిమ్మల్ని అనవసరంగా కదిలించాను.

నా—కాదు నాయనా! ఎప్పుడో ఒకప్పుడు నేనే చెప్పాలను కుంటున్నాను. దోవనుపోతున్నప్పుడెప్పుడైనా, చెట్టుకింద శవం కనిపిస్తే, దానిసంగతి కాస్త చూడు. (అందరికీ కళ్ళ నీళ్ళు తిరుగుతాయి)

వేణు—తాతగారూ! మీరిక నాదగ్గరే, మాయింట్లోనే వుండండి.

సా—అహ్హాహ్హా (నవ్వుతాడు)

వేణు—మరోలా అనకండి. మాయింట్లోనే వుంటాడు.

సా—(నవ్వి) ఉహూ, హూ; కాని, ఈ తిరిగే కాలు ఊరుకోదు.

వేణు—కాదు.

సా—(అతనిమాట వినిపించుకోకుండా) నీదగ్గర వున్నట్లే... ఎప్పుడూ వస్తూపోతూ ఉంటాగా! ఇలా గడవనీ. అదే చాలు.

[మనోహరం ప్రవేశం]

మనో—పద్మా...పద్మా...నిన్ను రమ్మంటున్నారే!

పద్మ—ఎవరూ?

మనో—నాన్నగారు. త్వరగా రమ్మంటున్నారు.

పద్మ—ఎందుకూ?

మనో—ఆ వెధవ ప్రశ్నలన్నీ ఎందుకు? తొందరగా- రా.

వేణు—వెళ్ళు పద్మా! పాఠం అయిపోయిందిగా!

[పద్మ లేచింది. వెనక నే మనోహరం వెళ్ళబోయి వెనక్కి తిరిగి]

మనో—నువ్వూరా కళా! అసలు బొత్తిగా మాయింటికి రావటం మానేశావేం. (కళ అన్న వంక చూస్తుంది)

మనో—మీ అన్నగారు ఆంక్ష పెట్టారా? కళనిచూడా పంపవేం వేణూ! ఇవ్వాళ పద్మను చూడటానికి పెళ్ళివారొస్తున్నారట.

వేణు—పెళ్ళివారా!! ... ... ... ఎవరు వారు?

మనో—ఆ, ఎవరోనా? మన ముకుందంవాళ్ళే.

వేణు—పద్మను ముకుందానికిద్దా మనుకుంటున్నారా?

మనో—ఆ, ఇద్దామనే. కళనుకూడా పంపు, వస్తా, (వెళ తాడు)

వేణు—సరే.

కళ—(అనుమానిస్తూ) వెళ్ళన్రా అన్నయ్యా?

వేణు—నీ ఇష్టమమ్మా...న న్నడగక్కరలేదు.

కళ—సరే...(లోపలికే వెళ్ళిపోతుంది)

వేణు }
సా } — (ఇద్దరూ ఒకరివంక వకరు చూచుకుని చిరునవ్వు నవ్వుకుంటారు)

సా—ఊ. ఏమిటిసంగతులు? ఇప్పుడిప్పుడే ప్రయివేటు పిల్లలు, పదిమంది చేరుతున్నట్లున్నారే ?

వేణు—ఆ, ఈఏడు బాగానే వుంది. ఇల్లావుంటే ఫర్వాలేదు.

సా—కాస్త బుద్ధిమంతుడ వని ఊళ్ళో పేరుపడిందిలే.

[కమలాకరం వస్తూ]

కమ—(వేణుతో) ఉన్నావా? (సాముద్రికునివంక చూసి) మీరూ వున్నారే!

సా—ఆ, ఉన్నా.

కమ—నే నెప్పు డొచ్చినా మీరిక్కడే వుంటున్నారేం, ఈ మధ్య ?

సా—మీ కేమున్నా అడ్డంవచ్చానా?

కమ—అబ్బే లేదు. నేనెప్పుడొచ్చినా మీరిక్కడే వుంటటం చూసి, నేను మీతోనే చెప్పాలనుకన్నాను. మీరెప్పుడు ఇక్కడేగాని, వేరెక్కడా కన్పించరు. కనక చెప్పటానికి వీలు కుదరటంలేదు.

సా—ఏమన్నా చెయ్యి చూచి చెప్పాలా?

కమ—అబ్బే, కాదు. మీంతో మాట్లాడదామనీ.....

సా—ఏం మాటలు! పెళ్ళిమాటలా?

కమ—ఆ. అవే పెళ్ళిమాటలే. (కొద్దిగా నవ్వి సిగ్గుతో)

సా—పెళ్ళిమాటలే? (వింతగా) నాతోనేం?

కమ—ఆ పెళ్ళిమాటలు...మీతోనే.

వేణు—తాతగారికి కాస్త ఆశ పుడుతున్నట్టుంది.

కమ—ఆ (గ్రహించి తట్టుకొని, తనూ వేళాకోళం సాగించ టానికే నిశ్చయించుకుని) "ఆ...మీమీద ఆశతోనే వచ్చాను. చూడండి. నాకు అట్టే లేకపోయినా పది ఎక రాల దాకా పొలం వుంది. (వేణుతో) నీకు తెలుసు కాదురా! కాస్తో కూస్తో చదువుకున్నాను.

వేణు—అవున్లే.

కమ—నాకు కళని చేసుకోవాలని వుంది.

వేణు—కళనా!

కమ—అవున్రా.

(వేణు లేచి ఒక ప్రక్కకి వెళ్తాడు ఆలోచిస్తూ)

కమ—నువ్వాలోచించు. నే నేం తగని వాణ్ణి కాదుగదా! కట్నం నాకేం అక్కరలేదు.

వేణు—కట్నం లేకుండా మీవాళ్ళు వప్పుకుంటారా ?
కమ—ఎవరు వప్పుకోవాలి? ఉన్నది మాఅమ్మ ఒక్కత్తేగా?
వేణు—(ఆలోచించి) కళా...కళా...(కళవస్తుంది) ఇదుగో! కమలాకరం. నిన్ను పెళ్ళిచేసుకుంటా నంటున్నాడు. ఏమంటావ్ ?
కళ—ఆ! ?
వేణు—నీ కభ్యంతరం లేకపోతే నా కభ్యంతరం లేదు.
సా—అతనికి అభ్యంతరం లేదని మరీమరీ చెప్పాడు.
కమ—తొందరేం లేదురా! అంతగాభరా పెట్టకు. ఆలోచించనీ.
వేణు—నేనేం తొందర పెట్టటం లేదు. అంతా దాని ఇష్టం.
కళ—నాపెళ్ళి కేం తొందరలే? ముందు నీ పెళ్ళి అవనీ.
వేణు—ఇదేమిటి? నీ పెళ్ళికావాలని నేనూ, నా పెళ్ళి కావాలని నువ్వూ అంటే ఎట్లా...
కమ—అంత తొందర పెట్టకురా...అబ్బా.
కళ—అయితే; యీ పెళ్ళివద్దు. (వెళ్ళిపోతుంది)
కమ—అబ్బ! అంత తొందర పెడితే ఎవరికి మాత్రం ఆలోచన కుదురుతుందీ? తర్వాత నువ్వు నెమ్మదిగా కనుక్కో
వేణు—అల్లాగే.
కమ—నువ్వు అడగటంలో వుంటుందంతా...
వేణు—అలాగే.
కమ—అడగటమే కాదు. కాస్త నచ్చచెప్పు,

[బయటనుంచి ముకుందం ఘాడావిడిగా ప్రవేశిస్తాడు]

ముకు—ఉన్నావా వేణు?...నిన్ను పిల్చుకు పోదామనే వచ్చా.

వేణు—ఏం ?

ముకు—నువ్వు వెంటనే బయలుదేరి **రా**వాలి. పెళ్ళిచూపు లకి. మన Friends అందరూ రావాలి. వస్తే అందంగా వుంటుందని మనోహరం అందర్నీ రమ్మన్నాడు. Time అయిపోయింది. పద, వాళ్ళందరూ కూర్చుని వుంటారు.

వేణు—మేం ఎందుకూ ?

ముకు—అమ్మమ్మ ! నువ్వు లేకపోతే ఎట్లా ?

వేణు—సరే పద.

ముకు—రా, రా, కమలాకరం. నువ్వూరా.

కమ—నేను రానులే !

వేణు—వాడు రాడులే.

ముకు—ఏం ?

సా—రాడులెండి...పదండి. నేనూ అటే వెళ్తాను.

[అందరూ వెళ్తారు. అందరి వెనకా కమలాకరం వెనక్కి వెనక్కి తిరిగిచూస్తూ వెళ్తాడు- కాసేపయిన తర్వాత... మనోహరం కిటికీలోంచి తొంగి చూస్తాడు. ఈలవేస్తాడు. కళా, కళా, అని పిలుస్తాడు...కళవస్తుంది]

కళ—నువ్వా !

మనో—మాటా...

కళ—వద్దు, వెళ్ళిపో

మనో—ఏం ?

కళ—ఏం లే ! వెళ్ళిపో...

మనో—ఆగు (తిరిగి ద్వారంద్వారా లోపలికొస్తాడు)

కళ.—రాకు వెళ్ళు...అన్నయ్య తిరిగివస్తాడు,

మనో—మాయింటికి రాకుండా ఆగిపోయావేం ?

కళ—ఏంలే; అన్నయ్య వస్తాడు; వెళ్ళిపో.

మనో—ఇప్పుడప్పుడే రాడులే...అందర్నీ అక్కడ కూర్చో పెట్టి...నేనిటువచ్చా.

కళ—ఎందుకూ ?

మనో—ఏంలే; మాట్లాడదామని; చాలారోజులయిందిగాదూ?

(కిటికీలోంచి కమలాకరం కనిపిస్తాడు.)

మనో—రాత్రి అందర్నీ సినిమాకని లేవదీస్తాను. నిన్నూ పిలుస్తాను. నువ్వు రా...

కళ—రాను.

మనో—ఏం ?

కళ—ఏంలే !

మనో—అయితే అంతా మర్చిపోయావా !

కళ—ఆ మర్చిపోయాను...మళ్ళీ జ్ఞాపకం చెయ్యకు.

మనో—అదేమిటి కళా?...మరచిపోతే నేను బ్రతకగలనా ? బ్రతిమాల్తాను...కళా? ఒక్కసారి...రాత్రికిరా; అన్నీ మాట్లాడదాం. పద్మపెళ్ళి అయిపోతుందిగా ? ఇక మనం మిగులుతాం. ఆ...నే చెప్తాగా అంతా ! రా...ఏం ?

కళ—మనోహరం !

మనో—తప్పకుండా వస్తావుగా ? చేతిలో చెయ్యి వెయ్యి.

(కళ దుఃఖంతో వెనక్కి తిరిగిపోతుంది)

మనో—(దగ్గరకెళ్ళి భుజంమీద చెయ్యి వేసి) కళా! సమయం కోసం కాచుకుని వున్నా...అంతే...వస్తా...? (వెళ్తాడు)

కళ—మనోహరం... మనోహరం (అంటూ వాకిలిదాకా తనూ వెళ్తుంది. కమలాకరం వాకిలిదగ్గర ఎదురువస్తాడు. కమలాకరాన్ని చూసి)

కళ—ఆ. నువ్వా!!

[కమలాకరం లోపలికి వచ్చి]

కమ—అయితే...మనోహరాన్ని పెళ్ళిచేసుకుంటావా ?

కళ—(మాట్లాడదు)

కమ—వాడిమాటలు నమ్మితే మోసపోతావ్! జాగ్రత్తగా ఆలోచించు. అంతే నేను చెప్పగల్గింది...వస్తా. (వెళ్తాడు)

కళ—(దిగులుతో టేబుల్ మీద వాలిపోతుంది, కొంచెం సేపయిన తరువాత అన్ని అలంకారాలతో, నగలతో, పద్మ గబగబా వస్తుంది)

పద్మ—(గాభరాపడుతూ) కళా; కళా...నేను లోపలే దాక్కుంటాను. ఎవరన్నా వచ్చి అడిగితే, రాలేదని చెప్పు.

కళ—ఏమిటది ?

పద్మ—ఏంలే! వచ్చేశాను! అంతే!

కళ—మరక్కడ పెళ్ళిచూపులు...?

పద్మ—అందుకే వచ్చేశాను.

కళ—అయితే...ఆ...పెళ్ళి నీకిష్టం లేదా!

పద్మ—లేదు.

కళ—మరి మీ నాన్నగారు కోప్పడతారేమో!

పద్మ—ఏమో. అదంతా తర్వాతసంగతి; కోప్పడతారని గొంతు కోసుకుంటామా ?

కళ—ఏం ? ముకుందం మంచి వాడేగా ?

పద్మ—మంచో చెడ్డో నాకిష్టంలేదు, అంతే. ఎవరన్నా వస్తారేమో! నే నా గదిలోకి వెళ్తాను.

కళ—(బయటికి చూసి) అన్నయ్య వస్తున్నాడు.

పద్మ—ఆ. (గబగబా లోపలికి పారిపోయింది)

[వేణు బయటనుంచి ప్రవేశం]

వేణు—బుద్ధిమంతురాలనుకున్నా గాని ఇంత అసాధ్యపు పిల్లనుకోలే! (కళతో) పద్మ ఏంచేసిందో చూశావా!

కళ—చూడలే.

వేణు—ఎక్కడికిపోయిందో, కన్పించకుండాపోయింది! ముకుందాన్ని చేసుకోటానికి యిష్టంలేకపోతే, ఇష్టంలేదని చెప్పరాదూ!

కళ—(వణకుతూ) చెప్పరాదూ!!

వేణు—ఏమంటావ్ ?

కళ—ఏంలే ?

వేణు—ఆడపిల్లల కింతంత ధైర్యం, ఎక్కడ్నించి వస్తుందో! తీరా మగపెళ్ళివార్ని ఇంట్లో పెట్టుకుని, ఇంటిల్లపాదీ సతమత మవుతున్నారు. వాళ్లనాన్నగారికి కళ్లనీళ్ళే తక్కువ! ఎక్కడికి పోయిందా అని......త్వరగా అన్నంపెట్టు. నేనూ వెళ్ళాలి. (అని లోపలికి పోబోతాడు)

కళ—అన్నం ఉడకలే.

(పద్మ వెళ్ళిన ద్వారంవైపు బిత్తరచూపులు చూస్తుంది.)

వేణు—మరింతసేపూ ఏంచేస్తున్నావ్?

కళ—ఏంచెయ్యటంలే (లోపలిద్వారంవంక సూస్తుంది, వణికిపోతూ)

వేణు—ఏమిటె ఖంగారు? అక్కడెవరున్నారు?

కళ—అహాహ! ఎవ్వరూలేరూ, ఎవ్వరూలేరు.

వేణు—మరెందుకు బిత్తరచూపులు...ఊఁ...ఎవరోవున్నారన్నమాట? ఎవరది? (గట్టిగా) చెప్పవేం.

కళ—పద్మ......

వేణు—పద్మా...? ఇక్కడుందా? ఇక్కడికొచ్చిందా? పద్మవచ్చి ఏడుస్తూ కాళ్ళమీద పడుతుంది)

వేణు—అరే!

(ఎవ్వరూ కాసేపు ఏం మాట్లాడరు)

వేణు—పద్మా!.........ఏం పనిది?

పద్మ—క్షమించండి, నన్ను వెళ్ళిపొమ్మనకండి.

వేణు—ఎంత అప్రతిష్టపని చేశావ్? నిన్ను కళ్లలో పెట్టుకు పెంచుతున్నాడే మీనాన్న. ఆయన గౌరవాన్నే కూలదన్ని......

పద్మ—నే నంతవరకుఆలోచించ లేదు. అక్కణ్ణించి దాటివతల పడాలనే గాని మరొకటి నామనస్సుకు తట్టలేదు.
వేణు—ఆ పెళ్ళి నీ కిష్టంలేదా?
పద్మ—లేదు.
వేణు—మరి ఆసంగతి మీనాన్న గారితో చెప్పావా?
పద్మ—ఆయన నన్నడగ లేదు.

[వెనక ద్వారంలో రాజగోపాలం కన్పిస్తాడు]

వేణు—మరా సంగతి మీ నాన్న గారితో చెప్తే వదలి పోయేదిదా. నీ ఇష్టాన్ని కాదంటాడా ఆయన ?
పద్మ—ఏమో, నా కా ధైర్యం లేకపోయింది. మీరే అదంతా ఆయనతో మాట్లాడండి. ఇప్పుడు నేను కన్పిస్తే కంఠం నులిమేస్తాడు.
వేణు—కాదు, పద్మా ఇప్పుడు నువ్వింటికి వెళ్ళిపో. ఇదంతా అందరికీ తెలియకముందే వెళ్ళితే ఏ అల్లరీ వుండదు.
పద్మ—అహ....వద్దు....నన్ను వెళ్ళమనకండి.....కావా లంటే...నే తప్పు చేశానని మీకుతోస్తే...నా కంఠం మీ చేతుల్తో మీరే నలిపి అవతల పారెయ్యండి అంతేగాని,
వేణు—సరేం ఫర్వాలేదు. నేను తీసుకెళ్ళి మీఇంట్లో దిగ విడుస్తా...రా...మీ నాన్న గారితో నేను మాట్లాడ తాగా?...రా...
రాజ—(లోపలికొచ్చి) ఒద్దులే వేణూ, ఒద్దులే,...పద్మా, ఎంత పనిచేశావే తల్లీ !....

వేణు—రాజగోపాలంగారూ!

రాజ—మీఅమ్మ బ్రతికుంటే... ఈ పనిచేసేదానివేనా!...

పద్మ—నాన్నా!...నన్ను...(మాట్లాడలేక ఆయన వంకే చూస్తుంది...వణికిపోతూ)

రాజ—నీకు కోరిన చీరల్లా కొనిపెట్టాను. కోరిన చదువల్లా చెప్పించాను. కోరిన పెళ్ళిచేయలేని క్రూరకర్ముణ్ణా నేను.

పద్మ—వద్దు...నాన్నా...వద్దు.

రాజ—నీ ఇష్టమే నాఇష్టం...నీకొకా—వాల్సిన పెళ్ళేచేసుకో; వేణూ! దగ్గరగారా...నువ్వు నాకు కొత్తవాడివి కాదు. మా మనోహరం లాంటివాడివే. నువ్వూ. ...పద్మను నీ చేతుల్లో పెడుతున్నాను. ఇకంతా నీయిష్టం.

వేణు—ఏదో చిన్నపిల్ల. పొరపాటు చేసింది. మీరు కష్ట పడకండి.

రాజ—అది సుఖపడితే నాకేం కష్టంలేదు. ఇక మీరిద్దరూ నన్ను సుఖపెడతారో కష్టపెడతారో అంతా మీయిష్టం.

వేణు—అదేమిటి? మీరు పొరబడుతున్నారు.

రాజ—పొరపాటేం లేదు. దాని మాటలన్నీ విన్నాను.

వేణు—కాదు. పద్మకి ముకుందాన్ని చేసుకోటం ఇష్టంలేదు. అంతే...వేరే సంబంధం చూడండి. అంతేగాని, ఎందుకు పనికిరాని నాకు...

రాజ—ఏమమ్మా; పద్మా!.....వేణుని చేసుకుంటావా.

(పద్మ అటే చూసి, సిగ్గుతో లోపలికి వెళ్ళిపోతుంది)

కళ—పద్మా...పద్మా (అంటూ నవ్వుతూ వెనక నే వెళ్తుంది)

రాజ—దాని మనసు నా కిదివర కే తెల్సిందిలే.

వేణు—నా కే తెలియదు. కాని...కాని...నా కేమిటి! నాకు అరే! మీతాహతెక్కడా? నేను...నే...నెక్కడా! నన్ను పెళ్ళాడి ఏం సుఖపడ్తుంది!

రాజ—సుఖం మనసులో వుందిగాని, భాగ్యంలో లేదు. ఇక పద్మ నిక్కడే వదిలి వెళ్తాన్నాను. మా ఇంటికి దాన్ని పంపనన్నా వద్దు. పెళ్ళి నిమ్మదిగా అవుతుందిలే...ఎదురుగానే మా మేడ. మా మేడమీదనుంచి మీయిద్దర్నీ రోజూ చూస్తూవుంటాను...కాని...జ్ఞాపకం వుంచుకో.. నే నక్కడ కన్పిస్తున్నా లేకపోయినా పైనుంచి (ఆకాశాన్ని చూపిస్తూ) మరో పరమ నిర్భాగ్యురాలు పద్మ వంకే చూస్తూ పడివుంది...ఇక నేను వస్తా......

[వేణు అల్లాగే చూస్తూ...నిలబడిపోయాడు. వెనకనుంచి పద్మ, కళవచ్చి నుంచుంటారు]

వేణు—(వెనక్కితిరిగి చూస్తాడు. వచ్చేనవ్వు అణిచిపెట్టుకుంటాడు. పద్మ తలవంచుకుంటుంది. కళ నవ్వుతుంది.)

వేణు—(పద్మవంకే చూస్తూ) అమ్మా! ఎంతదానివయ్యావ్!!

కళ—ఏం? ఎంతదయిందీ!

వేణు—నాకళ్ళకిన్నాళ్ళూ 'చిన్న' పిల్లగా కనిపించేదానివి. (కాసేపాగి ఇక నవ్వాపుకోలేక, నవ్వుతూ) నా భార్యగా నిన్ను చూస్తుంటే నాకు ఏమిటో, యిదిగావుంది. (నవ్వుతాడు)

(పద్మ సిగ్గుతో పారిపోతుంది. కళ పెద్దగా నవ్వుతుంది)

[సాముద్రికుడు ప్రవేశం]

కళ—తాతగారూ, పెళ్లయిపోయింది!

సా—శుభం, ఎవరిది?

కళ—పద్మకీ, మా అన్నయ్యకీ.

సా—మీ అన్నయ్యదా!! నేను నీ దనుకున్నాన్లే (నవ్వు తాడు)

కళ—పోండి [గబగబా లోపలికి వెళ్తుంది)

సా—ఏమిటెది ?

వేణు—ఏంలే. వెతుక్కోకుండా పెళ్ళికూతురు మా ఇంటికే వచ్చింది. వాళ్లనాన్న తప్పదన్నాడు. పెళ్ళికూతుర్ని ఇక్కడే వదిలేసి వెళ్ళిపోతూ "పెళ్ళికూడా అయిపోయి నట్టేపో, పొమ్మ"న్నాడు.

సా—అంతేలే. మనసులు ముడిపడిన తర్వాత మంత్రాలు ముఖ్యంకాదుగా! (కళ పద్మను చెయ్యిపట్టుకు లాక్కొ స్తుంది)

కళ.—రా...రమ్మంటుంటే...రావేం?...అహా! రావాల్సిందే

పద్మ—(కోపంతో) వద్దంటుంటే?...ఊరుకో.

కళ—ఉహూ. తప్పదురా (పద్మను తాతదగ్గరికి బలవంతాన లాక్కొచ్చి) ఊఁ, నమస్కారం చెయ్యి పెద్దలకి, ఊఁ, (వేణుతో) నువ్వుగూడా, ఇద్దరూ తాతగారికి నమస్కా రం చెయ్యండి (ఇద్దరూ నమస్కారం చేస్తారు)

సా—ఆయురారోగ్యాభివృద్ధిరస్తు, (కళతో) సౌమంగళ్య సౌభాగ్యాభివృద్ధిరస్తు. (ఇద్దరితో) శీఘ్రమే సుపుత్ర ప్రాప్తిరస్తు.

(పద్మ లేచి పారిపోతుంది. అందరు నవ్వుతారు)

[సనాయి వాయిద్యం దూరాన్నుంచి వినబడుతుంది, వాయిద్యం సాగుతుండగా తెరవాలుతుంది]

—: తెర :—

Not:—ఈ సన్నాయివాయిద్యం తర్వాత రంగం ప్రారంభించేవరకూ, తర్వాత కొంతసేపూ సాగవచ్చు.

# మూడవ రంగము

[సన్నాయి వాయిద్యం వినిపిస్తూంటుంది. శాలసాల పీటలమీద పద్మ వేణు కూర్చొనివున్నారు. తాతగారూ, రాజగోపాలం పురోహితుడి ప్రక్కన కూర్చునివున్నారు. కళ పద్మప్రక్కగా నుంచునివుంది. మనోహరం కమలాకరం ముకుందం దూరాన కుర్చీలమీద కూర్చునివున్నారు.

తెర లేచేసరికి పురోహితుడు మంత్రాలు చదువు తున్నాడు, సూనెలో మొహం చూడడం మొదలైనవి అయిపోయాయి. పురోహితుడు మంత్రాలు చదవటం పూర్తి చేయగా.]

రాజ—[సాముద్రికుడుతో) ఇక తరువాత తం తేముంది?

సా—ఏముందీ...ఇక నామకరణమే. పురోహితుడుగారూ! నామకరణంగూడా కానివ్వండి. మళ్ళీభోజనాలకి ఆలస్య మవుతుంది

పురో—ఆ...ఆ....(కళవంక తిరిగి) ఒక పళ్లెంలో...ఒక శేరు బియ్యంపోసి తీసుకురా అమ్మా...

[కళ లోపలికిపోయి బియ్యం తెచ్చిస్తుంది]

[పురోహితుడు...తిరిగి మంత్రాలు చదివి...ఆగి]

పురో—ఆ...ఇక నామకరణం...ఆపండయ్యా భజంత్రీలు మేళం ఆపండి. (మేళాలు ఆగాయి)

పురో—ఆ బంగారపు ఉంగరమిల్లా యివ్వండి. (రాజ గోపాలం ఉంగరం యివ్వగా, బియ్యపుపళ్లెం వేణువడిలో వుంచి... ఉంగరం చేతికిచ్చి)

పురో—ఆఁ! పెట్టదల్చుకున్న పేరు వ్రాయండి.

సా—చెప్పండి...సందేహిస్తారేం? ... రాత్రి ఏదో పేరు అనుకోకుండా వున్నారూ?

వేణు—నాకేమో మానాన్న పేరు పెట్టాలని వుంది...

(పద్మ వేణు తొడమీద గిల్లుతుంది)

వేణు—కాని పద్మ వాళ్ళ నాన్న పేరు పెట్టాలంటోంది.

(అందరూ నవ్వుతారు.)

రాజ—మీనాన్న పేరే పెట్టు. తర్వాత పిల్లలుపుట్టకపోతారా? పేరు పెట్టుకోకపోతారా?

కళ—ఎవరి పేరన్నా పెట్టండి! "ప్రసాద్" అని మాత్రం చివర రావాలి.

వేణు—(పద్మతో) ఏమంటావ్ మరి?

పద్మ—నే ననేదేముంది? ...నామాట వింటేగా.

సా—మొదటి కుర్రాడుగనక ఇంత ఆలోచన. వరసన అయిదారుగురు పుట్టినతర్వాత ఎంత వెతికినా...పేర్లుదొరకవ్. ఏదో...కానియ్యండి త్వరగా.

వేణు—(పద్మతో) ఏం? మానాన్న పేరు పెట్టేస్తా.

పద్మ—మీయిష్టం. నాదేముంది.

వేణు—(కోపంగా) నీది కాక ఇదంతా నాదా? నేను భార సాలే వద్దన్నా.

సా—పోనీ, ఇద్దరిపేర్లు పెడితే

పద్మ—ఆ... బాగుంటుంది.

సా—అయితే పెట్టెయ్యండి. "శివశంకర రాజగోపాల్ రావ్"

కళ—మరి నా పేరో... నేనొప్పుకోను. "ప్రసాద్" అని రావాలి.

సా—సరే "రావు" తీసేసి "ప్రసాద్" అంటేసరి. "శివ శంకర రాజగోపాలప్రసాద్".

పురో—శివుడిపేరు, కృష్ణుడిపేరు వచ్చాయిగనక, "బ్రహ్మ గారిపేరు" కూడా ఇరికిస్తే త్రిమూర్తులపేర్లు కలిసి వస్తాయి.

సా—"దత్తాత్రేయ" అని కలపవచ్చు. దత్తాత్రేయ శివ శంకర రాజగోపాలప్రసాద్. అంటేసరి.

వేణు—ఇంత పేరు ఈచిన్న పళ్లెంలో పట్టదే.

పురో—మూడుసార్లు రాయాలి. (వేణు పళ్ళెంలో పేరు ఒక్కొక్క అక్షరమే పలుకుతూ వ్రాస్తుండగా)

సా—(రాజాగోపాలంతో) ఏ పేరుతో పిలుస్తారో తెలుసా. ఇంతమందిలో ఎవరిపేరు కాదు. "ప్రసాద్" అని పిలుస్తారు.

కళ—ఏదో పేరుపెట్టుకోటం ముఖ్యంకాసి పిలవటం ముఖ్యం గాదుగా.

సా—ఆ, వ్రాయటం అయిందా? పురోహితుడుగారూ! ఆశీర్వాదం కూడా త్వరగా కానివ్వండి.

పురో—అదెంత సేపూ? మూడుసమిషాలు (ఆశీర్వాదపు మంత్రాలు చదువుతాడు.) ఆ! భజంత్రీలు మేళంవాయించండి......

[మేళం మ్రోగుతుంది రాజగోపాలం మనమడికి బంగారపు మామిడిపిందెలూ, బట్టలూ చదివిస్తాడు ఆశీర్వాదం అయిపోయింది. అందరూ అక్షింతలు చల్లారు. అందరూ లేచారు. పురోహితుడు కొన్నీ, కళమరికొన్నీ సామాను సర్దగా రంగం ఖాళీ అయింది. పద్మ పిల్లాడిని లోపలికి తీసుకుపోతుంది.]

రాజ—తర్వాత కార్యక్రమం. ఏమిటి?

సా—ఏముందీ? వంట అయితే మనం భోజనాలకి లేవటమే.

రాజ—భోజనాలకు వ్యవధి చాలావుంది లెండి. ఇంకా పదకొండున్నరన్నా కాలేదు.

కమ—చాలా వ్యవధివుందా! అయితే, లేరా, ముకుందం! మనం వక Round పేకాట వేసివద్దాం.

ముకు—వేద్దాంసరే! ఎక్కడా వేద్దాం? అది చెప్పు.

కమ—మన మనోహరం వాళ్ల మేడ ఖాళీగావుందిగా! అక్కడే వేద్దాం.

ముకు—అయితే పదమరి...రా...రా, మనోహరం.

మనో—ఆ పద. మిమ్మల్ని ఆటలో కూర్చోపెట్టి వస్తా.

ముకు—ఏం? నువ్వూ కూర్చోవూ?

మనో—మనంకూర్చుంటే ఎట్లా? ఇది మనం పరుగెత్తాల్సిన సమయం!

కమ—(నవ్వి) పదండి...పదండి.

[మనోహరం. ముకుందం, కమలాకరం వెళ్ళిపోతారు. పురోహితుడు సర్ది లోపలికి వెళ్తాడు పద్మ వచ్చి పిల్లవాణ్ణి అందరికీ చూపిస్తుంది. రాజగోపాలం పొంగిపోతాడు. సాముద్రికుడు "చిరాయుమస్తు" అని దీవిస్తాడు.]

సా—అంతా వేణుపోలిక.

వేణు—కాదు. మేనమామ పోలిక.

పద్మ—ఇదిగో (కోపంగా చూస్తుంది)

వేణు—సరే! నాపోలిక. సరేనా.

సా—ఎవరి పోలిక అయితే ఏంలే?

రాజ—తాతగారూ! ఇట్లూరండి మాట...ఇంకా వంట లవటానికి గంటన్నర వ్యవధివుంది. ఈలోపున మనం బజారుకెళ్ళొద్దామా! అబ్బాయికి ఒక చిన్న...చక్కని... మంచిది. ముద్దుగా ... చిన్నదిగా ... చక్కన్దిగా ...

[రాజగోపాలం అసలుసంగతి ఇంకా ప్రారంభించక మళ్ళీ ఆవ్వే చెప్పటం చూచి తాను అందిస్తూ]

సా—మంచిదిగా చూసి.........

రాజ—ఆ! మంచిదిగాచూసి. ఒక ఉయ్యాల కొనుక్కొవద్దాం.

సా—ఉయ్యాలా! దానికిప్పుడు తొందరేమిటి? ఇరవైయొక్కరోజుగ్గాని......

రాజ—అహా! కొనుక్కొవద్దాం. లేకపోతే Order యిచ్చివద్దాం. ఆవేళకొ్కా-వాలంటే మనకి దొరకవద్దూ......

సా—సరే పదండి...(ఇద్దరూ బయటకు వెళ్తారు)

వేణు—(నవ్వి) మీనాన్న తన పేరుపెట్టమని బలే పొంగి పోతున్నాడు.

పద్మ—ఆయన పొంగిపోయినకొద్దీ లాభంమీదేగా! అప్పీ యిప్పీ మీ అబ్బాయికి బహుమతులు చదివిస్తారు.

వేణు—ఓ! పెట్టామాలేవోయ్, పెద్ద నాలుగుకాసుల గొలుసు!

పద్మ—అంతేనా? ఈమామిడి పిందెలు ఎవరుపెట్టారు? మళ్ళీ యిప్పుడు ఉయ్యాలకు యాభై రూపాయలు,

వేణు—చిన్నప్పుడు మా అమ్మ చెపుతూ వుండేది. వాళ్ళ తాతగారు ఆయన కూతుర్ని అత్తవారింటికి పంపేటప్పుడు ఇచ్చి పంపటానికి పెద్దగుండిగెడు చలిమిడి చేయించార్ట. పొగపాటున ఆమె చలిమిడి గుండిగతీసుకెళ్ళటానికి బదులు. బంగారపు కాసులున్న గుండిగ బండిలో పెట్టుకుందట. ఏమైనాసరే; తీరాబండిలో పెట్టుకున్నాక దింపటానివీల్లేదు అని, ఆచలిమిడిముద్ద గుండిగకూడా బండిలోపెట్టి అత్త వారింటికి పంపించేశారట.

పద్మ—అందుకనే కాబోలు, తరం మారేటప్పటికి మీ తాత గారు మీ అమ్మను మీనాన్నగారికిచ్చి చేయాల్సి వచ్చింది.

వేణు—ఆ! తరంతోపాటు తరగతులు మారవూ? మారతాయి. రేపు మీ అన్నగారికితరం వచ్చేసరికి, చిప్పా దొప్పా మిగులుతాయిగా?

పద్మ—సరేలెండి! పెద్దగా చెప్పారు. పిల్లాణ్ణి తీసుకోండి. నాకవతల పనివుంది.

వేణు—నాదగ్గరెందుకూ! వద్దు.

పద్మ—వద్దంటే ఎట్లా! అక్కడ వంటవారికి అవ్వీ ఇవ్వీ అందివ్వాలి. ఇందండి.

వేణు—అబ్బే! నాదగ్గర వద్దంటే!

పద్మ—ఊఁహూ!

వేణు—అరే! చెపితే వినవే? వాణ్ణెత్తుకుంటే, ఇవ్వీ పట్టుబట్టేలు, వద్దంటుంటే...... (పద్మ పిల్లవాణ్ణి వళ్ళోవేసి వెళ్ళబోతుంది)

వేణు—అరే! చెపితే వినవే!...వదిలేస్తానంతే! వెళ్లకు! తీసుకెళ్ళు!...ఇదిగో! వదిలేస్తున్నా నంతే. (పద్మ ఆగి, ధీమాగా నుంచుని)

పద్మ—వదిలేయండి చూద్దాం......

[వేణు గంభీరంగా నుంచుని బెదరిస్తూ వున్నవాడల్లా, నవ్వుతాడు. పద్మ నవ్వుతుంది. పద్మను బ్రతిమాలుతూ]

వేణు—అబ్బ, తీసుకెళ్ళమంటుంటే, నాకేమిటో...ఏమిటీ కొత్తగావుంది.

[పద్మ నవ్వుతుంది, వేణు సిగ్గుపడతాడు. పద్మ దగ్గరకెళ్ళి పిల్లాణ్ణీ వేణునూ చూసి తిరిగి నవ్వుతుంది]

వేణు—నవ్వుతావేం?

పద్మ—(ఇంకా నవ్వుతుంది

వేణు—ఏమిటో అర్థం లేకుండా!

పద్మ—అది కాదు. పిల్లాణ్ణి మీ రెత్తుకుంటే, ఏదో పోలిక జ్ఞాపకం వచ్చింది.

వేణు—ఏం పోలిక?

పద్మ—(నవ్వుతూ) చెప్తే కోప్పడరుగదా.

వేణు—కోప్పట్టానికీ, కొట్టటానికీ నే నేం బడి పంతుల్ని కానుగా ఇంకా?

పద్మ—అహ (నవ్వుతూ) కాకముక్కూ, దొండపండు జ్ఞాపకం వచ్చాయి.

వేణు—నువ్వా ... (పద్మ పరుగెడుతుంది. వేణు పిల్లాణ్ణి అక్కడ చాపమీద పడకోపెట్టి వెంటపడి, వెళ్ళి, పద్మను లాక్కువస్తాడు)

వేణు—(లాక్కువస్తూ) నేను కాకిముక్కులాగున్నానా?

పద్మ—(లాక్కొస్తుండగా) అబ్బ! అదేమిటి, ఎవరన్నావస్తే బాగుండదు. వదలాండీ, ఇంకా చిన్నపిల్లల్లాగా.

పద్మ—(చెయ్యివదిలించుకుని చాపమీదవున్న పిల్లవాడివంక చూసి) అబ్బ! అదేమిటీ! ఒట్టిచాపమీద పడుకోపెట్టారు?

వేణు—పర్వాలేదులే, చాపవుందిగా.

పద్మ—అయితేమాత్రం!...పసిగుడ్డుగదా?

[ఇద్దరూ పిల్లాడిదగ్గర చేర్తారు. పద్మ చాపమీద కూర్చుని పిల్లవాణ్ణి వళ్ళోపడుకోపెట్టుకుంటుంది. వేణు పిల్లవాడివంక చూస్తూ, ముద్దు రాగా, నవ్వుతూ]

వేణు—ఊహుహు...చూస్తున్నాడు.

పద్మ—ఆ...ఆ...నాన్నగారి నాజూకు, చూస్తున్నాడు.

వేణు—(నవ్వాపి) ఊఁ, అదిగో, నవ్వుతున్నాడు.

పద్మ—ఆ, నవ్వే!! (అప్పుడే నవ్వా అన్నట్లు వేళాకోళంగా అంటుంది)

వేణు—అహా. నిజంగానే! నన్ను చూచి నవ్వితేనే?

పద్మ—నవ్వు కాదు, నా మొహం. పసిపిల్లలు అంతే.

వేణు—ఊహుహు (నవ్వి పిల్లాడివంకే చూస్తూ ... పళ్ళు బిగించు) Common sense లేదు, వెధవకి. గుప్పెడి గుప్పెడినోట్లో కుక్కుకుంటే పడుతుందిట్రా?

పద్మ—బాగానేవుంది. మేష్టరుగారు పాఠాలు మొదలా?

వేణు—పాఠాలు చెప్పకపోతే ఎట్లా? మేనమామలా తయారవకుండా వుండాలంటే, ఇప్పట్నించీ పాఠాలు చెప్పాల్సిందే.

పద్మ—ఆ, ఆ, మేనత్తలాగా తయారవకుండా వుంటేచాలు.

వేణు—(పిల్లాణ్ణిచూసి) ఊఁ, వస్తాదులాగ...ఆచేతులు తిప్పటం ఏమిటీ? (మళ్ళా పరీక్షగాచూసి అనుమానిస్తూ) మెల్లకన్నులు, మెల్లకన్నులాగేవుందే.

పద్మ—చాల్లెండి! వంకలు, మెల్లకన్నుట, మెల్లకన్ను శుభ్రంగావుంటే......

వేణు—కాదు, అదేం, కనిపిస్తుంటే.

పద్మ—(విసుగ్గా) తర్వాత అదేసరిగ్గా వస్తుంది లెండి.

వేణు—(నిరుత్సాహంగా) ఏమో! ఏం ఏడుస్తుందో?

పద్మ—పోన్లెండి, రాకపోతే. మెల్ల మేడెక్కుతుందట. ఈ పెంకుటిల్లు మార్చి మేడకడతాడు.

వేణు—పోసి వాడన్నా కడతాడు. నాజన్మకి ఇంతేగా.

పద్మ—ఏమో? అదృష్టం తిరిగివస్తే మీరే కట్టకూడదా?

వేణు—ఇంకా ఏం తిరిగివస్తూంది! వాడిజాతకం వచ్చి నా జాతకాన్ని తిప్పితే ఏమోగాని........

పద్మ—తాతగారిచేత చక్రం వేయించారూ?

వేణు—ఆ, వేయించా! జాతకం నిమ్మదిగా రాసిపెడతా నన్నారు.

పద్మ—కాస్త బాగారాయమని చెప్పండి.

వేణు—అంటే, ఉన్నవీ లేనివీ, కలిపి రాయమంటావా?

పద్మ—అబ్బ! బాగా అంటే అదికాదు. సరిగ్గా వ్రాయమనండి, జాగ్రత్తగా చూసి.

వేణు—ఆ...ఈ జాతకాలదేముందిలే......మనం కష్టపడి ఏదో, పైకితీసుకురావాలిగాని, (పిల్లవాడివంక చూస్తూ) వీణ్ణి పెద్దవాణ్ణవనీ! జిల్లాకలెక్టర్‌ని చేస్తాను.

పద్మ—నయం! M. L. A. అనలే.

వేణు—నీవుద్దేశ్యం వీడు Minister కావాలనేం?

పద—వీడికేమండీ! వీడు ప్రెసిడెంటవుతాడు. (పిల్లవాణ్ణి ముద్దుపెట్టుకుంటుంది)

వేణు—ఆ...మెల్లకన్ను ప్రెసిడెంటు.

పద్మ—ఇదిగో! మాట మాట్లాడితే మెల్లకన్ను అనకండి. చక్రాల్లాగ కళ్ళుంటే, మెల్లకన్నట, మెల్లకన్ను.

వేణు—కళ్ళు చక్రాలే! చక్రాల్లోనే మెల్ల (నవ్వుతూ పద్మ కళ్ళలోకి చూస్తాడు)

పద్మ—(పద్మ కోపం నటిస్తూ, బింకంగా, వస్తున్న నవ్వు లోపలే ఆపుకుని, అతనికళ్ళల్లోకి చూస్తూ.)

పద్మ—ఏమిటట్లా చూస్తారు?

వేణు—పద్మా (అల్లాగే కళ్ళల్లోకిచూస్తూ ఆగిపోతాడు)

పద్మ—ఏమిటండీ అది?

వేణు—పద్మా! మనంత సౌఖ్యంగా ఏ దంపతులన్నా వుంటా రంటావా?

పద్మ—(నవ్వుతుంది సిగ్గుతో)

వేణు—ఈ కొత్తరోజుల మురుపులో ఆ పాతరోజు లెట్లా గడచిపోయాయోకూడా జ్ఞాపకంరావటం లేదు. (కన్నీళ్ళు తిరిగి) పద్మా......

పద్మ—ఏమిటాకన్నీళ్ళు?

వేణు—ఇవ్వి కన్నీళ్ళుకావు, సంతోషంకూడా కాదేమో! ఏమైతే ఏంగాని, ఈ పచ్చని కాపురం ఇల్లాగే పండి పోతే......ఎంత బాగుంటుంది!

పద్మ—నే వెళ్ళొస్తాను. అవతల పనులన్నీ అలాగేవున్నాయి.

వేణు—వెళ్లకు! నన్నుకాసేపు ఇల్లా గర్వపడనీ...మనసు తెలిసిన మగువ; మనసును మురిపించే మగపిల్లాడు.

మమతలు లేని మనుగడ, ఇంతకంటె వేరే ఏముంటుందా స్వర్గంలో అంటూ?.........

[తన్మయంగా ఆగిపోయాడు. కాసేపయాక పద్మ నెమ్మదిగా అంటుంది.]

పద్మ—ఏమిటట్లాఆగిపోయారు. (వేణుమాట్లాడడు) ఏమండీ! మిమ్మల్నే...మాష్టరూ.

వేణు—ఆ...ఆ...ఏమిటీ...మాష్టారన్నావేమిటి (అట్టూ యిటు గబగబా చూసి) ఇవ్వాళ పిల్లల్నెవర్నీ పాఠాలకు రావద్దని చెప్పాగా.

పద్మ—ఎవ్వరూ రాలే...నేనే పిలిచా!

వేణు—(గబగబా) అబ్బా! మళ్లీ ఈలోకం జ్ఞాపకంచేశావ్ (పద్మ అతనివంకే చూస్తూ ఆతని ఆదుర్దా గమనించి దుఃఖం పొంగి రాగా)

పద్మ—అబ్బ...మర్మార్గురాలిని. కాని...అంత ఆనందం భరించటం కష్టమండీ!...భరించలేం, భరించటానికి ఈ బ్రతుకంతా చాలదు.

వేణు—పద్మా!

(పద్మా, వేణూ ఒకళ్ళ కళ్ళలోకి ఒకళ్ళుచూస్తూ తన్మయత్వంలో అలాగే నిలిచిపోతారు. బయటనుంచి రాజగోపాలం, సాముద్రికుడూ వస్తారు. సాముద్రికుడాగిపోయి, రాజగోపాలాన్ని ఆపి, సౌంజ్ఞచేస్తాడు. ఇద్దరూనిమ్మదిగా శబ్దంగాకుండా నడిచి రెండోవైపు గదిలోకి వెళ్తారు.

కాసేపటికి, కిటికీలోంచి రాయికట్టిన చీటీ ఒకటి వచ్చి వేణుముందర పడ్తుంది)..

వేణు—ఏమిటిది!...ఏమిటీ.....(వేణు చీటీతీసుకుని చూసి, చదివి ఖంగారుపడ్తాడు)

పద్మ—ఏముంది?

వేణు—కళ.....కళ.....కళేదీ... ఎక్కడుంది కళ?

(చీటీ విసిరేసి గబగబా లోపలికి వెళ్ళిపోతాడు, గబగబా పద్మకూడా వెళ్ళబోయి వెనక్కితిరిగి చీటీతీసి చూస్తుంది.)

పద్మ—కళా, (అని చీటీపారేస్తుంది.) [సాముద్రికుడూ, రాజగోపాలం రెండవప్రక్క గదిలోంచి వస్తారు]

రాజ—ఏమిటిది?

సా—ఏమయింది?

పద్మ—కళ పారిపోయిందట. లేచి...(గబగబా లోపలికి వెళ్ళిపోతుంది. రాజగోపాలం చీటీచూసి తీస్తాడు; ఇద్దరూ చదువుతారు)

రాజ—ఆ...ఆ...(దుఃఖం పొంగి వస్తుంటే ఆపుకుంటూ) మనోహరంతో, లేచిపోయింది. (ఉత్తరం నలిపిపారేస్తాడు. అది తీసుకుని సాముద్రికుడు చదువుతూ)

సా—'కళ, మనోహరంతో లేచి వెళ్ళిపోయింది. చిన్నకారులో. తొందరపడకండి......కమలాకరం.' (చదవలేక చదవలేక చదివి ఉత్తరం జారవిడుస్తాడు) ఏమిటిది! ఏమిటీ అన్యాయం?

రాజ—అన్యాయం కాదు, పోయ్యేకాలం!

సా—వండి, ఆ కమలాకరాన్ని కనుక్కుందాం, రండి చెప్తా!

(ఇద్దరూ బయటకు వెళ్తారు)

[వేణు తిరిగి వస్తాడు. చేతిలో ఒక వుత్తరం వుంటుంది. పద్మ చేతిలో పిల్లాడితో వేణు వెనకనే వస్తుంది]

వేణు—అబ్బబ్బ! ఎంత పనిచేసింది! ఎంతపనిచేసింది; పైగా తన వుత్తరంలో ఏం రాసిందో చూశావా. నేను క్షమించనని తనకి తెల్సునట. కాని కాలం గడిస్తే తనని క్షమించటం నేర్చుకుంటానట. ఎప్పుడన్నా దాని ఇష్టాన్ని కాదన్నానా! కావాలంటే ఈ పెళ్ళే చేయకపోయానా!

(Table దగ్గర కూర్చుంటాడు)

పద్మ—వూరుకోండి... వెతికి తీసుకొద్దాం.

[సాముద్రికుడు, రాజగోపాలం, కమలాకరం వస్తారు]

రాజ—వేణూ! (కాగలించు కుంటాడు) మన కడుపులో చిచ్చుపెట్టి పొయ్యారయ్యా!

పద్మ—నాన్నా!

రాజ—నే నిదివరకే అప్రతిష్ట పాలయ్యాను. నిన్నూ అప్రతిష్ట పాలుచేశాను వేణూ!

పద్మ—నాన్నా!!

రాజ—అమ్మా! (దుఃఖిస్తూ కుర్చీలో కూలబడతాడు. పద్మ చేతిలో పిల్లాడితో దగ్గరకు వెళ్తుంది. చేతిలో పిల్లవాణ్ణి చూసి) నాయనా ఇదంతా వింటున్నావా? నువ్వా

యిటువంటి పని చెయ్యకేం. తండ్రి జన్మ తరింప చెయ్య గాని ఇల్లా తరుక్కుపొయ్యేట్లు చెయ్యకేం.

వేణు—అమ్మా !

పద్మ—నాన్నా !

(వేణు తల టేబుల్ మీద దుఃఖవివశత్వంతో కొట్టుకుంటాడు. సాముద్రికుడు అతని ఆపుతాడు. వేణు తల ఎత్తే సరికి నుదుటిమీద నెత్తురు కనిపిస్తుంది.)

సా—వేణూ !

పద్మ—ఏమిటండీ ? (నుదురు తుడుస్తుంది)

సా—ఊరుకో వేణూ! ఏమిటీ అఘాయిత్యం!

వేణు—ఇకవూరుకోక ఏంచేస్తాను? ఏంచేసేదీలేదు. (కమలాకరంతో) కాస్తముందరన్నా చెప్పకపోయావుట్రా... జాగ్రత్త పడేవాళ్ళం.

కమ—నాకు మాత్రం ఏం తెలుసురా? మేం పేకాడుతున్నాం. మనోహరం వెళ్ళి ఎంతసేపటికీ రాకపోతేనూ ఏమిటో చూసివద్దామని, వెనక వసారాలోకి వెళ్ళాను. మనోహరం, కళ, వాళ్ళ దొడ్డివాకిట్లో చిన్న కారు ఎక్కడం చూశాను. అంతే. ఈమాట ముకుందంతో చెప్తే "వాడిది ఎప్పుడో తల పెట్టాడు, కాని ఇంతపని చేస్తాడనుకోలేదు" అన్నాడు.

సా—అంతపనీ చేశాడు. ఇనప్పెట్టెకుండా డబ్బంతా వెంటే తీసుకుపోయాడు.

పద్మ—ఆ! ఏం నాన్నా ?

రాజ—ఆ...పోనీ. పోతే తిరిగి సంపాదించుకుంటాం. కాని జన్మంతా పాటుపడినా సంపాదించుకోలేని దాన్ని మంట గలిపి పోయాడు.

సా—'బుద్ధిః కర్మానుసారిణి' అని అందుకే అన్నారు.

వేణు—అదిగో వేదాంతం! ఇక్కడ వేదాంతానికి చోటు లేదు. ఇది పొగరు, లేకపోతే బుద్ధిహీనత.

రాధ—అంతే. కాకపోతే మేం పెళ్ళి చేసుకుంటామని మనతో చెప్పకూడదూ!

కమ—కాని పెళ్ళిచేసుకోవాలని మనోహరానికి లేదు.

వేణు—ఆ!

రాజ—ఓరి నిర్భాగ్యుడా!

వేణు—ఇంతకు దీన్ని అనాలి. బుద్ధి లేంది దీనికి.

కమ—అయిపోయిందేదో అయిపోయింది, ముందేం చెయ్యాలో ఆలోచించండి.

వేణు—ఆలోచన కేముందీ?

కమ—అది కాదురా. నువ్వాలోచించు. ఇది తొందరపడి చేసిన పొరపాటు. ఎక్కడికి వెళ్ళాడో దర్యాప్తు చేసి ఊళ్ళో అల్లరవకముందే తిరిగి తీసికొస్తే సరిపోతుంది. అంతేగాని, ఇక్కడ ఏడుస్తూ కూర్చుంటే ఏముంది ?

సా—ఆ. అది బాగుంది. ఆ పని చేద్దాం. మీరు బయలు దేరండి. రాజగోపాలం గారూ!

కమ—ఇది ఎవ్వరూ ఎక్కడ అనకండి, అనవసరంగా అల్లరి అవుతుంది. తొందరగా బయలుదేరండి.

రాజ—(విచారంగా) పదండి (ముగ్గురూ వెళ్తారు)

వేణు—మన హడావిడిలో మనం వుంటే చల్లగా జారిపోయారు.

పద్మ—అసలు కళ పద్ధతే అంత...లోపలొక మాట, పైకో మాట.

వేణు—అహ (వ్యంగ్యంగా)

పద్మ—ఎన్నాళ్ళనుంచి వుందో ఈ ఆలోచన!

వేణు—ఏమో? అది నీకే తెలియాలి.

పద్మ—నాకెలా తెలుస్తుంది?

వేణు—ఎన్నాళ్ళబట్టీ ఆలోచించి ఆ రోజున అలా పారిపోయి వచ్చావ్?

పద్మ—ఏరోజున?

వేణు—నీ పెళ్ళి చూపుల రోజున.

పద్మ—(సిగ్గుపడి) చాల్లెండి. సమర్థించారు, చెల్లెల్ని.

(వేణూ...వేణూ అని బయటనుంచి ముకుందం కేక వినిపిస్తుంది.)

వేణు—ఎవరది?

ముకు—ఏరీ! ఈ కమలాకరం మనోహరమూను ఏరీ?

వేణు—ఆ!

ముకు—పేకాటకి కూర్చున్నాం. నన్నొక్కణ్ణీ వదిలేసి ఎక్కడికి వాళ్ళక్కడ దూసుకున్నారు. భోజనాలకి టైం అయింది. ఎవ్వరూ రారు.

వేణు—నీకు వాళ్ళెక్కడికి వెళ్ళారో తెలియదూ?

ముకు—తెలియదు. ఇక్కడకొచ్చి వుంటారేమోనని చూసి పోదామని వచ్చా.

వేణు—వచ్చి వుంటారేమో...చూసి పోదామని వచ్చావ్!

ముకు—ఏరీ, వాళ్ళంతా! భోజనాల కాడావిడికూడా లేదే.

వేణు—ఏరీ వాళ్ళంతా? ఇక్కడికి రాలేదే!...ఎక్కడికి... వెళ్ళారో నీకు తెలియకపోతే కళకి తెలుస్తుందిలే... పద్మా! కళను కేకేసుకురా కనుక్కుందాం.

పద్మ—కళనా!

వేణు—(కసురుతూ) ఆ కళనే-పో-స్టోర్లో వుంది. తీసుకురా. తొందరగా (పద్మ వెళ్తుంది)

ముకు—కళ స్టోర్లో వుందా!

వేణు—ఆ వుంది...కాళ్ళూ చేతులూ కట్టేసి పడేశాను.

ము—అయితే. మనోహరం? (తొందరపాటులో అనేశాడు)

వేణు—(గ్రహించి, కోపంగా) ముకుందం! చెప్పు! ఎక్కడికి వెళ్ళారు వాళ్ళిద్దరూ! (మీదకు వెళ్ళి చొక్కా పట్టుకుని బెదిరిస్తాడు)

ము—ఆ...

వేణు—చెప్తావా? గొంతు పిసికెయ్యమంటావా!

ముకు—వేణూ...

వేణు—చెప్తావా! చస్తావా?

పద్మ—(గబగబావచ్చి) ఏమిటండీ? ఆగండి!

వేణు—నువ్వూరుకో పద్మా!...

ము—ఆ...గ...రా!

వేణు—చెప్పు. ముందు ప్రాణాలమీద ఆశ వుంటే ఎక్కడికి వెళ్ళారో చెప్పు.

ముకు—బొంబే (Bombay)

వేణు—బొంబే! (చేతులు వదులు చేశాడు)

ముకు—ఆ, బొంబే అని చెప్పాడు! మరెక్కడికి వెళ్తాడో! వాడు చెప్పేదొకటీ, చేసేదొకటీ! ఇక్కడణ్ణించి ఏదో వక స్టేషన్ దాకా కారులో వెళ్ళి రైలు ఎక్కుతాం" అన్నాడు.

వేణు, పద్మ—అయితే ఇదంతా నీ కిదివరకే తెల్సున్నమాట.

ముకు—ఆ... తెల్సు! కాని నా కెందుకని ఊరుకున్నా.

వేణు—నా కెందుకని వూరుకున్నావ్! పచ్చని చెట్టు భగ్గున మండిపోతుంటే చూస్తూ వూరుకున్నావ్.

ముకు—కాదురా...వాడు స్నేహితుడు...

వేణు—వాడు స్నేహితుడు, నేను కాదు కాదూ? వాడికి సహాయం చేశావ్. మమ్మల్ని నాశనం చేశావ్ కాదూ? వాడి పని చాలా మంచిది. నేను వాళ్ళకి అయిష్టం కాదూ? నీ చెల్లెలే ఈ పనిచేస్తే వూరుకుంటావా? తోడి కుటుంబం పాడయిపోతుంటే చూస్తూ వూరుకుంటావు ఎట్లా.

ముకు—కాని...

పద్మ—బొంబే వెళ్ళారని నాన్నగారికి వాళ్ళకి చెప్పవలెను. త్వరగా.

ముకు—అవున్రా! నేను వస్తాపద. కేక లేసి వెనక్కి లాక్కు వద్దాం. వాళ్ళిద్దరికీ నేనూ నచ్చచెప్తాను.

వేణు—అక్కర్లే.

ముకు—కాదు. మనోహరం సంగతి నీకు తెలియదురా!

వేణు—తెలియదు. కనకే ఇంతపని జరిగింది. కానీ ఏదో సుఖపడదామని వెళ్ళారుగా! ఏం సుఖపడతారో చూద్దాం.

ముకు—నా మొహం. వాడు కళని పాడుచేస్తాడు. అంతే

వేణు—అంటే!

ముకు—పెళ్ళిచేసుకుంటాడనే నమ్మకం లేదు.

పద్మ—ఆ?

ముకు—తీసుకెళ్ళి డబ్బు అయిపోయిన తర్వాత పెళ్ళిచేసుకుని ఏం చేస్తాడు?

పద్మ—ఏంచేస్తానన్నాడు!

ముకు—వాడికి ఆ ఆలోచన వుంటేగా.

వేణు—అయితే వాడికి ఆలోచనే లేదని నీకు తెలిసీ, వాడి గతి వాడిదని మెదలకుండా వూరుకున్నావన్నమాట.

ముకు—వాడు చెప్తే వినే రకం కాదురా.

వేణు—ఇదా నీస్నేహం?

ముకు—కాదురా.

వేణు—నువ్వు నా స్నేహితుడవనుకున్నాగాని నిజంగా వాడి విరోధివి నువ్వు.

ముకు—(మాట్లాడడు)

పద్మ—ఎందుకూ కాలయాపన? త్వరగా కారులో వెళ్లితే దొరుకుతారు.

ముకు—అవున్నా! మహా వెళ్తే ముప్పైమైళ్లు వెళ్ళివుంటారు. త్వరగా బయలుదేరుదాం పద.

వేణు—వద్దు. వెళ్ళారు. అనుభవించనీ ఎన్నాళ్లు ఏం అనుభవిస్తారో! అనుభవించి అనుభవించి నాశనం అవనీ. నాశనం అయినతర్వాత తిండిలేక ఇంటికివస్తే ఇంత పిండా కూడు ఆజన్మాంతరం పారేద్దాం.

పద్మ—అబ్బ!

వేణు—అదే జరగబోతుంది పద్మా! అదేజరగబోతుంది! ఎవ్వరూ వెతకక్కరలేదు. వెళ్ళి, మీనాన్ననీ, కమలాకరాన్ని పిల్చుకు వచ్చెయ్యండి. ఆలోచనలేకుండా ఈపని చేసినందుకు అనుభవించనీయండి. అంతే.......... .........అంతేకావాలి.

—: తెర :—

———

## నాలుగవ రంగము

[అదేసావడి : తెరఎత్తేసరికి పద్మ వేణుకు తమలపాకులకు సున్నము వ్రాసి యిస్తోంది.]

పద్మ—ఇవ్వాల్టికి మీవుద్యోగం పూర్తియినట్టేనా?

వేణు—ఆ, అయినట్టే...ఏంవుద్యోగమో? కుర్రాళ్లు సరిగ్గా చదివి పాసవకపోతే పంతులుసరిగ్గా ప్రయివేటుచెప్పనట్టు. ఆ మాచెర్లవాళ్ళ అబ్బాయికి మార్కులు వేయించాలి. కాగితమన్నా నల్లబడితే నాలుగు మార్కులు వేయించవచ్చు......మీనాన్నగారేరీ? ఇవాళ్ళ కనిపించనేలేదు.

పద్మ—తాతగారు వచ్చారూ, ఇద్దరుకలసి. అబ్బాయినెత్తుకు వెళ్ళారు. తాతగారు రాంగానే ఉరుకుంటాడు, వెధవ! ఇవ్వాళ పెద్దపేచీ, ఎత్తుకుతీసుకెళ్ళమని.

వేణు—వాడికి మరీ గారాబం నేర్పుతున్నారు వీళ్ళిద్దరూ. (లోపల్నించి కేకలు వేణూ......వేణూ......అని) ఎవరూ, కమలాకరమూ? రా, రా.

కమ—(వచ్చి, వేణు కూర్చోమని సౌంజ్ఞచేయగా)మీరేదో మాట్లాడుతున్నట్లున్నారు.

వేణు—ఫర్వాలేదులే, రా.

పద్మ—ఈమధ్య బొత్తిగా ఇటురావటంలేదేం?

వేణు—ఎట్లావస్తాడూ! కొత్తపెళ్ళికొడుకాయె; కొత్తవుద్యోగమాయె.

పద్మ—ఇంకా ఏం కొత్తపెళ్ళికొడుకు. సంవత్సరం తిరిగిపోతే?

వేణు—సరే. నీకూ నాకు అల్లాఅని, అందరికీ అప్పుడే కొత్త తీరిపోతుందా! ఏదీ, ఇంకా కొడుకన్నా పుట్టందే?

కమ—కొడుకుపుడితే కొత్తతీరిపోతుందా!

వేణు—ఏమో? ఏమే? (పద్మను అడుగుతాడు)

పద్మ—చాల్లెండి. నాకవతల పనివుంది (వెళ్తుంది)

కమ—ఏదైనా, ఇప్పట్నించీ ఆ ఖాదరబందీఎందుకులే? ఏదో, ఇట్లా గడచిపోనీ, కొన్నాళ్ళు.

వేణు—ఇప్పుడు నీకేం? చక్కగా వుద్యోగం కుదిరింది. కులాసాగా కాపురంచేస్తున్నావు.

కమ—బాగానేవుందిలే. నే ననుకున్న దానికంటే బాగానే వుంది.

వేణు—ఏం? తృప్తిలో కాస్త అసంతృప్తి తగిలించావ్?

కమ—అబ్బే! అసంతృప్తి ఏంలేదు. ఒకప్పుడు అసలు పెళ్ళే వద్దనుకున్నా. మా అమ్మ ఎంతో గోలచేసేది. రోజూ ఇంటికివెళ్ళగానే పెద్ద దెబ్బలాట. అయినాసరే వద్దన్నా. ఆమె చచ్చిపోతూగూడా పెళ్ళిచేసుకోరా అంటూ కళ్ళు మూసింది.

వేణు—పాపం!

కమ—ఆమె చచ్చిపోయి కక్ష సాధించింది.

వేణు—అదేమిటి?

కమ—ఏముంది? ఇంటికి వెళ్ళంగానే ఎవ్వారు లేరుగా; వంటరిగాణ్ణయిపోయాను. ఎన్నాళ్ళు సొంతగా చేతులు

కాల్చుకోసునా? ఎవరిని నాకు పెళ్ళి చెయ్యమని అడగను? చివరికి మా పెత్తల్లికొడుకు అడ్డం పడ్డాడు. వాడూ నా ఈడు వాడేగనుక.

వేణు—పెళ్ళి చేయించాడు.

కమ—నేను పెళ్ళికూతుర్ని కూడా చూడలేదు. తెలుసా? "ఏదో ఎవత్తో ఒకత్తె...మన కోరికలు తీరని తర్వాత ఎవరయితే ఏంలే"...అని వేదాంతంలో పడ్డా...పెళ్ళి కొప్పుకున్నా.

వేణు—ఏం కోరికలవ్వి?

కమ—ఏవైతే ఎందుకులే! అవన్నీ మర్చిపోదామనే అనుకున్నా! మర్చిపోయాకూడా! పెళ్ళయింది. కొన్ని రోజుల తర్వాత ఇలాగే ఒకసారి ఆలోచించుకుంటే నేనా వెనుక రోజుల్లో కోరుకున్న దానికీ ఇప్పుడు జరుగుచున్న దానికీ ఏం భేదం కనిపించటం లేదు.

వేణు—అహా...!

కమ—ఆ! చిన్నప్పుడు; నేను నాభార్య, ఎలావుండాలనుకునే వాణ్ణో, అలాగేవుంది. అంతేకాదు......ఏంమాట్లాడా లనుకునేవాణ్ణో అవే మాటలూ, అవే చేతలూ!

వేణు—(నవ్వుతాడు)

కమ—నిజంగానేరా! తమాషాగా మాట్లాడటంకాదు. అందు లోనూ, మనం మాట్లాడదలుచుకున్నది, మనంమాట్లాడ తాంనరే! అవ్వే జవాబులుకూడా ఎల్లావస్తాయా అని?

వేణు—(మరీ నవ్వుతాడు)

కమ—ఏమిటో గమత్తు! ... మొదట్లో నూ ఆ పేరు సామాన్యంగానే కనిపించింది. "మన సౌభాగ్యజీవితానికి ఇంత కంటేనా" అని ఒకసారి అనుకున్నా కొత్తలో; కాని, పోనుపోను అదే అందంగా కనిపించింది. అచ్చంగా కళలాగ. (తొందరలో అనేస్తాడు)

వేణు—కళలాగా!

కమ—ఆ, కళలాగా! (అని తన పొరపాటు గ్రహించి నాలుక కరచుకుంటాడు)

వేణు—(మరీనవ్వుతాడు)

కమ—పొరపాటున అన్నాను. మరేమీ అనుకోకేం?

వేణు—అంటే అన్నావులే.

కమ—(సిగ్గుపడి) నాలికమీదకు వచ్చి అనేశా! మనసులో కూడా ఏం అనుకోకేం!

వేణు—అనుకోనులే.

కమ—ఏమిటో? ఆరోజులు తల్చుకుంటే సిగ్గువేస్తుంది. ఆ భావాలూ, ఆవేశాలూ, అన్నీ ఆదర్శాలనిపించేవి. ఎవరితో మళ్ళా అనకుగానీ, కళ ఒకసారి పెళ్ళిచేసుకుంటానంటే వద్దు పొమ్మందే, ఆరోజున ఎంత తెలివితక్కువ పని చేశానో తెల్సా? తలకొట్టేసినట్లయిపోయింది. ఇంటికెళ్ళి పురితగిలించుకొని, దూకేశా.

వేణు—(నవ్వబోగా)

కమ—నవ్వకు. అబద్ధం కాదు. నిజంగానే. ఆ తాడు బలం చాలక తెగికిందపడ్డాను. మెడ గీరుకుపోయింది. మోకాలు నెప్పిపెట్టింది.

వేణు—అదృష్టం!

కమ—కాదూమరి! మోకాలు నెప్పిపెట్టకపోతే మళ్ళీ దూకే వాణ్ణి! (ముకుందం "వేణూ, వేణూ" అని బయటనుండి) పిలుస్తాడు.

వేణు—ఆ! ఎవరది?

కమ—(బయటకుచూసి) ఆ! మన ముకుందం! రారా, రా.

[ముకుందం వస్తాడు]

ముకు—నువ్వా యిక్కడే వున్నావా?......సరే......

వేణు—రా...కూర్చో. (వేణు కుర్చీచూపిస్తాడు)

ముకు—కూర్చోటానికేంలే......కాని, మావాడికి నువ్వో కాస్త ప్రయివేటు చెప్పాలిరా—మా తమ్ముడికి. వాడికి బొత్తిగా చదువబ్బటంలేదు. ఈవుద్యోగంలో చేరినదగ్గర నుంచీ నే నింట్లో వుండటానికి వీల్లేదు. నెలకు ఇరవై రోజులు టూరు. (Tour) వాడిసంగతి పట్టించుకునే వాళ్లెవరు కన్పించలేదు.

వేణు—అల్లాగేలే. రేపట్నించి పంపించు.

ముకు—ఏరా? కమలాకరం! బొత్తిగా కనిపించటంలేదు.

కమ—ఏదీ నువ్వూళ్లో వుండీ బయటికి వస్తున్నావ్ గనకా!

ముకు—ఏంచెయ్యమంటావురా? ఇదిగో అబ్బాయ్! నేచెప్తున్నావిను. మనం చిన్ననాడు ఏవేం, కలలు కంటామో

గాని, అవ్వీ ఆనాటితోనే సరి అనుకో, తిరిగి ఆ కలలు, కలలోకికూడా రావు.

కమ—ఏం?

ముకు—ఏం యేమిటి? నాసంగతి చూడరాదూ! జీవితం ఏమవుతుందో తెలియని ఆరోజుల్లో ప్రేమనీ, అనుకూల దాంపత్యమనీ, ఏవో అనుకుంటాం. అనుకున్నదంతా అనుభవించగల్గింది, ఎవరో కొందరు. అంతే.

వేణు—నువ్వు చాలా ఆలోచించే పెళ్ళిచేసుకున్నట్లున్నావ్.

కమ—ఆలోచనేంకర్మం! ఆరునెల్లు ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు.

ముకు—నిజమే, కాని!

కమ—కాని అంటావేమిటి? ప్రేమ విఫలంకాలేదుగదా!

ముకు—అబ్బే, అదికాదురా నెలకు ఇరవైరోజులు Tour. ఇంట్లో కాస్త కులాసాగా గడపటానికి Time ఏదీ? అబ్బాయ్! మనం అనుకోటమేగాని అనుకున్నట్టేమీ జరగదు. ఆ, ఇరవైరోజులక్రింద బొంబాయివెళ్ళాను. అక్కడ మన 'మనోహరం' కనిపించాడు.

కమ—అహా! ఎల్లావున్నాడు?

ముకు—భోజనానికి కూడా పిల్చాడు. కళ చాలా మారింది, కాని వాడేం మారి లేదు. డబ్బంతా అయిపోయినట్టేవుంది. కాని, ఇంకా వాడికి Life అర్థంకాలేదురా. ఇక్కడెల్లా వున్నాడో, అక్కడా అంతే. వేణూ! కళ నిన్నొకసారి వుత్తరం వ్రాయమన్నదిరా.

కమ—పాపం......!

ముకు—పాపం! కళ్ళనీళ్లు పెట్టుకుంది చూడంగానే. బయలుదేరి వస్తూంటే, అడగలేక, అడగలేక, ఉత్తరం వ్రాయించమని అడిగింది.

వేణు—ఛీ! దాని సంగతి నాదగ్గర ఎత్తకు.

ముకు—నే తప్పకుండా వ్రాయిస్తానన్నాను.

వేణు—కావాలంటే వ్రాసుకో అంతే...ఏదో, ఇప్పుడిప్పుడే అంతా మర్చిపోయి, ఇల్లా కాలం గడుపుతున్నాం. ఇల్లా మమ్మల్ని బ్రతకనీ, అంతే.

ముకు—సరే. నే వస్తామరి. మా వాణ్ణి ప్రయివేటుకు పంపిస్తాను. (కమలాకరంతో) నువ్వూ వస్తావా? ఉంటావా?

కమ—నే నుంటాలే. ఈ శ్లోకానికి అర్థం చెప్పించుకోవాలి (ముకుందం వెళ్ళిన తర్వాత) ఇది బళ్ళో పాఠం చెప్పాల్సి వచ్చిందిరా. కాస్త అర్థం చెప్పు. (ఒక పుస్తకం పేజీ చూపిస్తాడు)

వేణు—(చదువుతూ) "బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః। లిప్యతే న స పాపేన పద్మపత్ర మి వాంభసా" ఊఁ. ఈ శ్లోకానికి అసలు అర్థం లేదుపో.

కమ—శ్లోకానికి అసలు అర్థం లేకుండా ఎలా వుంటుందిరా?

వేణు—శ్లోకానికి అర్థం చాలామంచిదే. ఆచరణలో మాత్రం అసాధ్యం. "ఎవడు ప్రపంచంలో మనం చెయ్యాల్సి వచ్చే పనులన్నింటినీ దైవం మీదే మన నుంచి ఆకర్మల

మీద ఆసక్తిని విడిచి, చేస్తాడో వాడిని ఈ పాపాలేవీ, తామరాకును నీరు అంటనట్లు అంటవు'' అని. నిజమే తామరాకును నీరు అంటదు. కాని నీటి బొట్టు బరువు తామరాక్కు తగలకుండా వుంటుందా? ఆ బరువుకు తామరాకు వంగిపోవటంలేదా? అల్లాగే ఈ సమస్త కర్మలు నెత్తి నణిచివేస్తుంటే ''పాపాలు నన్నంటవు'' అని నేను కూర్చో గలనా?

కమ—అదంతా ఎందుకురా! ఇది పిల్లల పుస్తకంలో వుంది. రేపు పాఠం చెప్పాలి. అర్థం చెప్పావూ. నే నెళ్ళి పాఠం చెప్పేస్తా! సరిపోతుంది.

వేణు—(నవ్వి) పద్మపత్ర మి వాంభసా.

మ—ఏమంటావ్?

వేణు—''రేపు బళ్ళో పాఠం చెప్పాలి. ఏదో అర్థం చెప్పేస్తాం. ఆ అర్థం ఏదయితే మన కెందుకూ!'' ఇదే ఆశ్లోకానికి భావం. ''పద్మ పత్ర మి వాంభసా''

కమ—ఆ, అదంతా వేదాంతంరా!

వేణు—వేదాంతం తెలియకుండానే నువ్వు వక వేదాంతి వయ్యావ్.

కమ—ఆ! ఎందుకొచ్చిన వేదాంతం? సరే మరి వస్తా.

వేణు—పద్మపత్రమి వాంభసా (నవ్వుతూ నిట్టూర్పు తాడు)

[పద్మ ప్రవేశిస్తుంది]

పద్మ—పిల్చారా?

వేణు—లేదే.

పద్మ—ఏదో 'పద్మ' అని పిలిచినట్టు వినిపిస్తేనూ. ఏరీ, వీళ్ళింకరా లేదూ? (వాకిటివైపు చూస్తుంది)

కమ—ఇక నే వెళ్ళి వస్తారా. (కమలాకరం వెళ్ళిపోతాడు)

వేణు—ఎవరికోసం చూస్తున్నావ్?

పద్మ—(ఆత్రంగా) తాతగారూ, నాన్నగారూ పిల్లాణ్ణి ఎత్తుకెళ్ళి అరగంట అయింది.

వేణు—వస్తారులే. తొందరేం?

పద్మ—(ఆతురతగా) తొందరేమిటి? ఇంతపొద్దెక్కినా ఇంకా రాకపోతే!

వేణు—తీసుకెళ్ళింది మీనాన్న, తాతగారు. పిల్లాడికి మరేం భయం లేదులే.

పద్మ—భయం లేదనుకోండి. కాని మరీ ఇంత ఆలస్యమా?

వేణు—(బిగ్గరగా నవ్వుతాడు)

పద్మ—నవ్వుతారేమండీ? పిల్లాడు రాలేదని నాకిదిగావుంటే.

వేణు—అహా పద్మ పుత్రానికి నీళ్ళంటే ఎంత సంగం ఎంత అసక్తి! (నవ్వుతాడు)

పద్మ—అబ్బ! ఊరుకోండి! వాణ్ణి చూడకపోతే నాకేం తోచటం లేదు. అన్నం తినే వేళ అయింది...వెళ్ళి చూస్తా (వాకిట్లోకి వెళ్ళి చూచివస్తుంది) ఇంకా రాటం లేదు.

వేణు—(నవ్వాపుకుంటూ) ముకుందం మొన్న నెప్పుడో బొంబాయి వెళ్ళాట్ట.

పద్మ—బొంబాయి కాకపోతే కలకత్తా వెళ్ళనీయండి. అబ్బాయి ఇంత నేపట్నించీ కన్పించకపోతే ఏం లేదుగాని ఎవడో ఎక్కడికో వెళ్ళాట్ట.

వేణు—బొంబాయిలో అతనికి మీఅన్నయ్య కనిపించాట్ట.

పద్మ—అన్నయ్య కన్పించాడా!...ఎవరికీ?

వేణు—(నవ్వుతూ) ముకుందానికి.

పద్మ—కులాసాగా ఉన్నాడా?

వేణు—(పెదవి విరచి) ఉన్నాట్ట! ఒక పూట వాళ్ళతో భోజనంకూడా చేశాట్ట. కళ నన్నోకసారి ఉత్తరం వ్రాయమని గోలపెట్టిందట.

పద్మ—పాపం! రాయండి. నాలుగేళ్ళు అయింది.

వేణు—ఊహూ (పెదవి విరుస్తాడు)

పద్మ—అదేమిటి? అంత కాఠిన్యం! తోబుట్టిన చెల్లెలు మీదను కూడానా!...

వేణు—నీ ప్రేమ...నా తోడబుట్టిన చెల్లెలు మీదా?... నీ తోడబుట్టిన అన్నమీదా?

పద్మ—ఏదో ఒకటి. ఏదైనా...వక్కటేగా?

వేణు—అందుకనే ఇలా చిచ్చుపెట్టిపోయారు. ఛీ! వాళ్ళ సంగతి నాకు జ్ఞాపకం చేయకు. కొమ్మ విరగబడి గాలికి కొట్టుకుపోయిన... తర్వాత చెట్టుకేం పట్టింది?....... (పళ్ళుబిగించి) పోనీ, ఎక్కడో అక్కడ...ఎల్లాగో అల్లా ఖులాసాగా వున్నారు. అంతవరకే చాలు.

పద్మ—(నవ్వి) ''పద్మపత్ర మివాంభసా''

వేణు—ఆ, (పద్మనవ్వు గ్రహించి) అంతే...ఊ...ఉత్తరం రాద్దాంలే.

[బయటనుంచి ''కొంక్కొం కొంక్కొం...కొంక్కొం కొంక్కొం'' అని వినిపిస్తుంది]

పద్మ—అదేమిటి ?

[తాతగారు, రాజగోపాలం వస్తారు]

తాత—(పిల్లవాణ్ణిదించి నవ్వి) ఇవ్వన్నీ కొనుక్కువస్తున్నాం. దోవలో ఎత్తుకోమని గోలచేసాడు.

వేణు—వాడికి మరీ గారాబం చేస్తున్నారు.

రాజ—ఇదిగో, పద్మా! ఇవ్వి యింట్లోకి తీసుకుపో. (ఏవో పొట్లాలిస్తాడు)

వేణు—ఇవేమిటి ?

రాజ—మిఠాయిపొట్లాలే!

వేణు—అన్ని కొన్నారేమిటి ఒక్కసారే ?

రాజ—ఆ...ఎన్నిలే...

వేణు—పోనీ, ఇది మొదటిసారయితే...ఏదోముచ్చట అనుకోవచ్చుగాని........

రాజ—మొదటిసారో, రెండవసారో, నేనింతకంటె ముచ్చట గడపలేనుగదా. ముచ్చటపడేవాళ్ళు దాటిపోయారు. (కళ్ళనీళ్ళు...తిరిగాయి...కొల్చుకొని) ఆ...ఆ వంటామె యివాళయినా వచ్చిందా ?

పద్మ—ఆ! వచ్చింది. రారా బాబూ...అన్నం తిందువు గాని,

రాజ—ఇప్పుడే మాతో Hotelలో టిఫిన్ పడ్డగి పే. ఇప్పుడే పెట్టకు. తర్వాత...నాదగ్గర తింటాడు.

పద్మ—సరే......టిఫిన్ కూడ పెట్టించారూ ? ...కేం... బాగా నే వుంది. నీళ్ళన్నా పోస్తారా.

తాత—ఆ...పద్మా! నాలుగు వీధులూ తిరిగొచ్చాం. కాస్త దిష్టి తీసెయ్యి.

పద్మ—ఆ...(పిల్లవాణ్ణి తీసుకువెళ్తుంది)

వేణు—మీరు మరీ......

తాత—అలా అనకు. ఎవరి కళ్ళెల్లాంటివో!

వేణు—అదికాదండీ...మరీ అంత గారాబం పనికిరాదు. వాడు అడిగిందల్లా కొనటమా ? పోనీ కొంటేకొన్నారు... కాని ఒక్కసారే ఇన్నెందుకూ, ఒక్కరోజులో వీటన్నిట్నీ పాడుచేసేస్తాడు.

రాజ—అబ్బాయ్...వాణ్ణి చూసుకు బ్రతుకుతున్నాం. మా ముద్దు యిట్లా గడవనీ తర్వాతంతా నీ యిష్టం.

వేణు—అదిగాదండీ. ముద్దని మరీ భుజాలమీద కెక్కించు కోటమా?

రాజ...అది నేనుకాదు! ఈయన...వద్దంటున్న కొద్దీ రోడ్డు మీదకూడ "కొక్కోం" అంటం మొదలెట్టాడు.

తాత—(నవ్వి) అప్పుడు రోడ్డుమీద ఎవ్వరూ లేరులే. ఆ, ఇక నే వెళ్ళొస్తామరి.

రాజ—కాదా గండి......ఇంత ప్రొద్దెక్కిన తర్వాత వెళ్ళి ఇప్పుడేం చెయ్యి కాల్చుకుంటారు? ఈపూటకు యిక్కడే వుండండి.

వేణు—అసలు మీ కెందుకండీ, ఈగోల! తాతగారూ? మాతో వుండరాదూ, హాయిగా?

రాజ—ఆ! నే నొక్కణ్ణి యిక్కడ చేరాగదా! మనిద్దరిదీ ఒక్కటే ఆశ్రమం. మీ ఒక్కపొట్ట మాకేం బరువు కాదులెండి. ఇక్కడే వుండండి.

వేణు—ఇప్పుడు ఏ యిబ్బందికూడా లేదు. వంటామెగూడ వుంది.

తాత—నేనేం మీకు బరువు అనిగాదు. కానీ, తిరిగేకాలు వూరుకోదు. ఈ కాలికీ ఖ్యింకా బిగిసిపోలేదుగా.

రాజ—కాదు. నామాటవినండి. ఉండండి. ఇద్దరం "కృష్ణా, రామా" అనుకుంటూ అరుగుమీద పిల్లాణ్ణి వేసుకు కూర్చుందాం.

తాత—అదొక్కటే, నన్ను ఆశ పెడుతూంది.........నిన్న భోజనానికి వెళ్ళేటప్పుడు నావెంట కుర్రాణ్ణి తీసుకుపోదామా అనుకున్నా.

రాజ—ఆ, చిక్కారు తాతగారు. ఉండండి. ఇక వుండిపొండి.

పద్మ—(ప్రవేశించి) మీరు భోజనానికి లేవ్వొచ్చు. వంట అయింది.

తాత—కుర్రాడికి దిష్టితీశావా?

పద్మ—ఆ, నాలుగు మిరపకాయలు, కుంపటినిప్పుల్లో వేస్తే చిట పట మని కూడ అనలేదు, కారుకూడా లేదండీ.

తాత—(వేణుతో) చూశావా! నే నేమన్నాను?

పద్మ—మీరు స్నానాలకి లేవండింక.

రాజ—ఆగాగు పద్మా! తాతగారు ఇవ్వాళ్ళనుంచీ యిక్కడే వుంటారు. ఇప్పుడే "ఊ" అన్నారు.

పద్మ—ఆ! నిజంగా? ఇన్నాళ్ళకి మిమ్మల్ని వప్పించగలిగాం.

వేణు—మనం కాదు వప్పించింది. మెడలమీద ఎక్కిన వాడే తల వూపించాడు,

పద్మ—ఎవరది?

రాజ—అబ్బాయి, మన బాబు, ప్రసాదు (సంతోషంతో అంటాడు)

పద్మ—రండి. త్వరగా అందరికీ వడ్డించమంటాను.

తాత—అప్పుడే ఏం భోజనం? ఇప్పుడేగా Express వచ్చిందీ!

పద్మ—(లోపలికి చూచి ఏదో అపాయం జరగబోతున్నట్లు) ఆ...ఆ...బాబూ, బాబూ, (అని పద్మ లోపలికి పరిగెత్తింది)

రాజ—ఏమిటది?

వేణు—ఏమయింది?

తాత—ఏం చేశాడు? (అందరు లోపలికి పరిగెత్తుకుబోతారు)

[పద్మ పిల్లవాణ్ణి ఎత్తుకుని వస్తుంది. అందరూ ఆగారు]

పద్మ—చెయ్యి కోసుకునేవాడు. కత్తిపీటతో ఆడుతున్నాడు. (కుర్రాడితో) వెధవా! కత్తిపీటతో ఆడద్దంటే...

రాజ—ఇదిగో పద్మా! మాట మాట్లాడితే వాణ్ణి "వెధవా, వెధవా" అనకు

వేణు—అసలా కత్తిపీట అల్లా ఎందుకు పడేశావ్?

తాత—చెయ్యి కోసుకోలేదుగదా? సరిగ్గా చూశావా?

పద్మ—అయినా వదలినచోట వుండకండి! వెధవ అల్లరీ పీడూనూ.

రాజ—అదిగో మళ్ళీ! ...నీ నోటి కింకో తిట్టురాదూ?

తాత—అవును. ఆయనపేరు కావాలని పెట్టుకుని ఆయన ఎదటే తిడితే ఆయన కెట్లావుంటుంది?

(అందరూ నవ్వుతారు. వాకిట్లో ఏదో బండి శబ్దం అయింది. అందరు అటుచూచారు)

పద్మ—ఏదో బండి వచ్చింది,

తాత—ఎవరో దిగుతున్నారు.

(పద్మ ఎదురు వెళ్తుంది)

తాత—కళలాగుందే!

వేణు—కళే! తిరిగి వచ్చింది సిగ్గు లేకుండా.

తాత—మనోహరం కూడా వచ్చాడు.

రాజ—ఆ...(అటూ యిటూ తిరుగుతాడు)

వేణు—అయిందన్నమాట. అనుకున్నంతా అయింది. ఇక తిండి గడవక ఇంటికి చేరారు.

తాత—నువ్వొక నిమిషం వూరుకో వేణూ! తర్వాత మాట్లాడ వచ్చు.

[కళ, పద్మ లోపలికి వస్తారు. మనోహరాన్ని ముకుందం వెంటబెట్టుకు వస్తాడు]

పద్మ—లోపలికి పద కళా! కాళ్ళు కడుక్కుని బొట్టుపెట్టుకో.

కళ—వద్దులే! ఈ యింట్లో కాలు పెట్టటానికే నాకు అర్హత లేదు.

వేణు—(కోపంగా) అయితే ఎందుకొచ్చావ్ తిరిగి?

తాత—వేణూ!

కళ—అన్నయ్యా! నువ్వేమన్నా దోషం లేదు. అనదల్చుకునే దంతా అనేశెయ్యి. ఇంతసేపూ వూరుకోవటమే ఆశ్చర్యంగా వుంది.

వేణు—ఆశ్చర్యం!—ఆశ్చర్యం ఏముంది? ఈమాత్రం ఆలోచన ముందేవుంటే బాగుండేదిగా. వెళ్ళటమే ఆశ్చర్యం గాని తిరిగి రావటంలో ఆశ్చర్యం లేదు. రాకేం చేస్తారు తిండిలేకపోతే?

కళ—తిండి లేకపోతే పస్తుండేదాన్ని, తిండికోసం తిరిగి రాలేదు.

వేణు—అవును! ప్రేమ కాదూ! తిండిలేకపోయినా ఫర్వాలేదు. పస్తున్నా ఫర్వాలేదు. మరి పస్తే వుండిపోక పోయారూ అక్కడే?

కళ—ఉండేదాన్నే—కానీ —

వేణు—కానీ. . .—

కళ—వారు. . .వాళ్ళ నాన్నగారిని చూడాలన్నారు.

రాజ—(కోపంగా) అక్కరలేదు! ఆ పాపిష్టి మొహం నాకు చూపనక్కరలేదు. . .ఇక తిరిగి వెళ్ళండి.

కళ—ఆ!

రాజ—కావాలంటే వందో రెండొందలో పట్టుకెళ్ళండి. పోండి. ఎంత త్వరగా ఇక్కణ్ణించి పోతే అంతమంచిది.

ముకు—రాజగోపాలంగారూ!

పద్మ—నాన్నా!

రాజ—పోయాడుగదా సుఖపడ్డాననుకుంటున్నా. నాలుగేళ్ళ నుంచీ మనస్సు తేలిగ్గా వుందనుకున్నా. మళ్ళీవచ్చాడు మంగలంలో పెట్టి వేచటానికి

మనో—కళా! (దిగ్గున లేచాడు) ఇక పోదాంరా! (అందరూ అటు చూశారు)

కళ—ఆ...ఎక్కడికి?

మనో—చావడానికి.

పద్మ—అన్నయ్యా? (దగ్గరకెళ్ళి కౌగలించుకుంటుంది)

మనో—పద్మా.........

పద్మ—ఆ...ఏమిటది? (చెయ్యి తడిమిచూసి పైన వున్న శాలువ తీసేస్తుంది. పక్షవాతంలో పడిపోయిన చెయ్యి కనిపిస్తుంది...కట్టెలాగ)

మనో—పద్మా!......(కుంగిపోతాడు.)

ముకు—చెయ్యీ కాలూ పడిపోయాయి!

తాత—పక్షవాతమా!!

రాజ—ఆ.........

కళ—ఒక పూట ప్రాణమే దక్కదనుకున్నారు. ఈ మాత్రంలో బయటపడ్తా మనుకోలేదు. కాస్త తేలిక చిక్కిన తర్వాత ఇంటికి పోదామని కలవరించాడు.

రాజ——(దగ్గర కెళ్ళి చెయ్యి పట్టుకు చూస్తాడు.)

మనో——(దుఃఖంతో) నాన్నా! నే నక్కడే చస్తే నీ కీ బాధ వుండేదికాదు. అవును. నిన్ను బాధపెట్టటానికే తిరిగి వచ్చాను.

తాత——అందరూ భోజనాలకు లేవండి. అన్నీ తర్వాత మాట్లాడుకుందాం...ముందు భోజనాలకి లేవండి.

ముకు——ఏడికి జ్వరంగా కూడావుంది...ఎక్కడన్నా పడుకో పెట్టాలి.

తాత——పద్మా...అతనికా గదిలో పక్క వెయ్యి.

పద్మ——ఆ...ఆ (రెండో వైపు గదిలోకి వెళ్తుంది.)

ముకు...(తాతగారితో) ఇక్కడికి రావటానికి చాలా బాధ పడ్డారు. ముందు మాయింటి దగ్గర ఆగారు. నన్ను కూడా రమ్మని పిలిస్తే సరేనని వచ్చా...

పద్మ——(గదిలోంచి తిరిగివస్తూ) తీసుకురండి; పక్క వేశా. మీరందరూ భోజనాలకి లేవండి.

తాత——కాస్త సాయం చెయ్యండి (ముకుందంతో అనగా)

ముకు——ఆ...ఆ...(రెండవ ప్రక్కగదిలోకి మనోహరాన్ని తీసుకెళ్తారు. అక్కడ మనోహరాన్ని పడుకోబెట్టి వస్తారు. తిరిగి వస్తున్న తాతగారితో)

వేణు——రండి. మనం భోంచేసి వద్దాం.

[సాముద్రికుడు, రాజగోపాలం వేణుతో లోపలకు వెళ్తారు, రంగస్థలం మీద కళ వుంటుంది]

ముకు—వస్తా కళా! అయిపోయిందానికి విచారించి ఏం లాభం! ఇక మరేం ఫర్వాలేదులే. వస్తా.

[ముకుందం వెళ్తాడు, కళ దుఃఖంతో టేబుల్ మీద వాలిపోతుంది. కాసేపయాక అక్కడే వున్న నీళ్ళ గ్లాసు తీసి దాంట్లో ఒక పొట్లం విప్పి...పొడి కలపబోతుంది. కాని ఇంతలో పద్మ ప్రవేశించి

పద్మ—లోపలికి రావేం కళా ?

కళ—వస్తాలే! నువ్వు పద.

పద్మ—రా! వాళ్ళందరూ భోజనాలకి కూర్చున్నారు. ఎందుకూ ఆలస్యం ? (వెళ్ళిపోయింది)

కళ.—(తిరిగి పొడి—కలపబోయింది. కిటికీలో కమలాకరం కన్పిస్తాడు)

కమ.—కళా!

కళ—(చేతిలో పొట్లాం...దాచేస్తుంది)

కమ—(లోపలికి వచ్చి) అంతా విన్నానులే! దుఃఖించి ఏం ప్రయోజనం...దూరదృష్టి లేనప్పుడు ? ఇక్కడ వంటరిగా ఏం చేస్తున్నావ్. పాపం! మనోహరం ఏడీ ?

కళ—ఆ లోపలున్నారు. (అని లోపల వైపుకు చూపిస్తుంది].

కమ—ఆ చేతిలో దేమిటి ?

కళ—ఏం లేదు.

కమ—చూసి వస్తా.

కళ—ఆ. (కమలాకరం రెండవ ప్రక్కగదిలోకి వెళ్తాడు)

[కాసేపాగి...ఎవ్వరూ రాకపోవటం చూసి...కళ, తిరిగి పొట్లం విప్పి, మందు నీళ్ళల్లో కలుపుతుంది. రెండవ ప్రక్కగది వాకిలి దగ్గర్నించి కమలాకరం కళను చూస్తాడు. గ్రహిస్తాడు. ముందుకు వస్తూ.]

కమ—పద్మ...ఏదీ...ఆ లోపల వుందా? (అంటూ లోపలి వైపుకి వెళ్తాడు తిరిగి కళ మందు త్రాగటాన్కి ప్రయత్నిస్తుంది. కాని యింతలో పద్మ ప్రవేశించి)

పద్మ—కళా—ఏం చేస్తున్నా విక్కడ? లోపలికి రావే!

కళ—(మందు తాగబోయి పద్మను చూసి ఆగి) పద్మా—(దుఃఖిస్తూ కావలించుకుంటుంది)

పద్మ—వూరుకో కళా! అయిపోయిందేదో అయిపోయింది. అన్నయ్య ఇక వేరేం అనరులే. కోపంలో ఏదో అన్నా మనసులో మమకారం లేని మనిషి కాదు. ఊరుకో— ఏమిటిది? ఈ నీళ్ళు తాగుతున్నావా? ఇవ్వి మంచి నీళ్లు కావు...మంచి నీళ్ళు కావాలంటే లోపల్నించి తెస్తా నాగు.

కళ—పద్మా!

పద్మ—(గ్లాసుచూపిస్తూ) ఏమిటది చెప్పు...విషం తాగ లనేనా!

కళ—కాదు పద్మా!

పద్మ—అబద్ధం ఆడకు. కమలాకరం నువ్వు దీంట్లో విషం కలపటం చూసి వచ్చి నాకు చెప్పాడు. కళా! మా

మనసు రాయనుకున్నావా! మేం మనుష్యులం కాదను కున్నావా! ఇంటికి వచ్చిన ఆడబడుచు ఇంటి గుమ్మంలో ప్రాణం విడిస్తే.

కళ—పద్మా...

పద్మ—లోపలికి రా.

కళ—రాను. రాలేను. ఈ పాపిష్టి దాన్ని ఇక్కడే పడి చావనియ్యి. జీవితాన్ని చేతులారా నాశనంచేసుకున్నాను. బ్రతుకునే బ్రద్దలు చేసుకోనియ్యి. మీ అన్నయ్యను కనిపెట్టి వుండు. చాలు.

పద్మ—ఫర్వాలేదు. నయం అవుతుందిలే. చేసింది పొరపాట యినా తప్పుపని కాదులే.

కళ—తప్పుపనిమాత్రం ఎందుకుకాదు? మే మిద్దరం ఎంత కలిసి మెలిసి వున్నా నేను లేచిపోయిన దాన్నేగా! ఈ మాట ఎప్పటికీ మాసిపోదు. ఈ జన్మకింతే—తరాలవెంట పడి వంశానికే కళంకం తెస్తుంది. రేపు నా పాపం బద్దలై ఒక శిశువు కలిగితే దాన్ని లేచి వచ్చినదాని కూతురే అంటారు.

పద్మ—అదంతా తర్వాత చూసుకుందాంలే!

కళ—కాదు పద్మా! ఆలస్యం చేయకుండా ఆలోచించుకో వాల్సిందిప్పుడే. వంశానికి కళంకంరాకుండా ఒక్క ప్రాణంపోతే చాలు.

పద్మ—అయితే?

కళ—ఆ గ్లాసు యియ్యి. నే చేసిన పాపం. రూపం దాల్చి వంశాని కే వంకర తేకుండా వెంటనే తాగేస్తాను.

పద్మ—కళా! కానియ్యి. మరేం ఫర్వాలేదులే. అంతగా అయితే—కూతురే పుడితే, ఆ కూతుర్ని నాకొడుక్కే చేసుకుంటాను.

కళ—పద్మా! (దుఃఖంతో కౌగలించుకుంటుంది.)

పద్మ—లోకం ఏదో అనుకుంటుందనీ, మనం కడుపు కోసు కుంటామా? మనం రాక్షసులుగా మారిపోతామా కళా?

కళ—పద్మా......

పద్మ—లోపలికిరా...పోదాం. (తీసుకుపోతుంది)

—: తెర :—

## ఐదవ రంగము

[అదే సావడి. తెర ఎత్తే సరికి టేబుల్ దగ్గర కుర్చీల మీదే కాళ్ళుంచుకుని సమముసూ కాళ్ళకూ అంగవస్త్రం చుట్టి కట్టుకుని రాజగోపాలం, సాముద్రికుడూ మాట్లాడకుండా కూర్చుని వున్నారు. కొంత సేపటిదాకా ఎవ్వరూ మాట్లాడరు. తర్వాత]

రాజ—ఇవ్వాళ ఎన్నో తారీఖూ ?

సాము—ఇవ్వాళా ? మంగళవారం. పన్నెండో తారీఖు

రాజ—లాభం లేదు. మీ జోస్యాన్నీ సాముద్రికన్నీ తీసి కెళ్ళి గంగలో కలపండి,

సా—ఏం ? మంగళ వారమనా ?

రాజ—కాదు. పన్నెండో తారీఖని మీరు చెప్పిన తారీఖు వచ్చేసింది. ఇంతవరకూ ఏం లేదు.

సా—పద్మ సంగతేనా మీర నేది !

రాజ—ఆ. అదే అంత ఆలోచించి అన్ని లెక్కలేసి మరీ చెప్పారు. పన్నెండో తారీఖు వచ్చేసింది.

సాము—కాదు. కళ విషయంలో నే చెప్పింది గంటల ప్రకారం జరిగిందా! ఆడపిల్ల పుట్టిందా! మరీ...మనో హరం విషయం నయమవుతుందని చెప్పానా ?

రాజ—ఆ చెప్పారు. మిడతంభొట్లు జ్యోతిషం (తెరలోకి చూసి) అడుగో బాబూ

సాము——ఇదిగో చాకులెట్లురా బాబూ.

(బనీను జేబులోంచి చాకులెట్లు తీస్తాడు)

రాజ——అహా, అవ్వి దాయండి. ఎక్కువపెడితే అజీర్తి చేస్తాయి. ఇదిగో! నాదగ్గర పంచదార బిళ్ళ లున్నాయి.

సా——పంచదార బిళ్ళలు ఎక్కువ తింటే జలుబు చేస్తాయి. చాకులెట్లు ఇవ్వాళ వా డసలు తినలేదు.

రాజ——కాదు తిన్నాడు. ఇందాక గోడచాటుకు...తీసుకెళ్ళి మీరు చాకులెట్లు పెట్టడం నేను చూశాలెండి.

సా——ఇందాకేనా? అప్పుడు నేను ఒక్కటేగా పెట్టింది. మీరు నాలుగుబిళ్ళలు పెట్టారు. ఇవతలకు రాంగానే.

రాజ——ఇప్పుడు మరొకటిపెట్టినా ఫర్వాలేదులెండి. (నవ్వి) ఊఁ. నే ముందుపెడతా. తర్వాతమీరు (లోపలికిచూసి) ఏడీవాడూ?

సాము——అటునుంచి అటే లోపలికి వెళ్ళినట్లున్నాడే?

రాజ——దొంగముండ......యిప్పుడు(లోపలప్రక్క గుమ్మం చూపిస్తూ) వచ్చాడండీ.

సా——ఏమిటో! ఇల్లంతా వాడిదే.

రాజ——ఇక, ఆకర్ణామృతం, తీసి చదవండి కాసేపు.

సా——వాడిమాటలముందు, ఈ కర్ణామృతం ఎందుకు పని కొస్తుంది.

(పుస్తకంతీసి శ్లోకం చదువుతాడు)

శ్లో॥ బాలోఽపి శైలోద్ధరణాగ్రపాణి
ర్నీలోఽపి నీరన్ధ్రితమః ప్రదీపః

ధీరోఽపి రాధానయనాపబద్ధో
జారోఽపి సంసారహరః కుత స్త్వమ్.
శ్లో॥ బాలాయ నీలవపుషే నవకిజ్కిణీక
జలాభిరామజఘనాయ దిగమ్బరాయ
శార్దూలదివ్యనఖభూషణభూషితాయ
నన్దాత్మజాయ నవనీతముషే నమస్తే.

రాజ—ఓహోహో! ఏంబాగుందండి, మనవాడి Photo వుంది, చూశారూ. ఆ. మామిడిపిందెలూ అవ్వీ కట్టుకోని అది కళ్ళకు కట్టినట్లు కనిపిస్తోంది.

సా—(నవ్వుతాడు)

[ కళ, మనోహరం వస్తారు ]

సా—ఏమమ్మా! ఇట్లాతీసుకొచ్చావేం?

కళ—ఏంలేదు. ఇట్లావచ్చి కూర్చుంటానంటేనూ! (పడక కుర్చీమీద కూర్చోపెడుతుంది)

సా—(మనోహరాన్ని పరీక్షగాచూచి) ఇదివరకటంటే బాగా నయంగానే వుంది. వేళ్ళకూ్కడా పూనిక చిక్కుతు న్నాయా, నాయనా!

మనో—(మాట్లాడకుండా ఆయనముఖంలోకి దిగులుగా చూస్తాడు)

సా—ఏం నాయనా! మాట్లాడవేం?

మనో—తాతగారూ! ఒకనాడు ఈచెయ్యే, చేయరాని పని చేసింది......పడిపోయింది.

సా—అదా? అదంతా మర్చిపో.

మనో—ఈ చెయ్యి పడిపోయిన రోజంతా మీరే నాకు కళ్ళల్లో కనిపించారు. "ఏదీ యిప్పుడు కొట్టమని" ఆక్షే పించినట్లు అనిపించింది.

సా—అయ్యయ్యో!—నువ్వేం బాధపడకు నాయనా!

మనో—దగ్గరకు రండి. మీ కాళ్ళనంటి నా పాపం కడుక్కుం టాను.

సా—పిచ్చివాడా! అదంతా నే నెప్పుడో మర్చి—పోయాను. నాకు దెబ్బతగిలినమాట నిజమే, ఈ లెంపమీద! కాని అదే దెబ్బ ఆనాడే నీకు మనసుమీద తగిలిందన్నమాట. నా దెబ్బ అప్పుడే మానిపోయింది. నీ దెబ్బ మానిపోలేదు. అందుకనే ఈ శరీరబాధలు ఆత్మకు వర్తించవని నమ్మి చరించాలి. నీమనస్సు చెప్పినట్లు నువ్వు చరించావింత వరకూ, కనక శారీర బాధ మనసుకు పట్టింది. అందుకనే గీతలో "ఏతత్ (మనస్సును) ఆత్మన్యేవ వశం నయేత్" అన్నాడు. చూశారా, రాజగోపాలంగారూ! మనసుకు మనం బానిసలమైతే మనమనసే శత్రువౌతుంది. ఫర్వా లేదు నాయనా! అదంతా మర్చిపో." ఫర్వాలేదు.

రాజ—(ఏదో జ్ఞాపకమువచ్చి) ఆ! మర్చిపోయాను. మనం బజారు వెళ్ళొద్దూ డాక్టరుగారి దగ్గరకుకూడా వెళ్ళవద్దా మనుకున్నాం.

సాము—ఔనౌను. పోదాం పదండి.

రాజ—(బయలుదేరేలోగా) ఆగండి. బాబును కూడా తీసుకొస్తాను.

సాము—వాడెందుకూ ఎండలో ?

రాజ—అహ. తీసుకు వస్తాను. సరదాగా.

[లోపలికి వెళ్ళి బాబును ఎత్తుకొనిరాగా ఇద్దరు కలిసి బైటకు వెళ్తారు]

కళ—ఆయన చెప్పింది నిజమే! చేసిన తప్పులన్నీ మనసులో వుండి మరీ బాధ పెడ్తాయి.

మనో—మనం బాధ పడితే పడ్డాం. మనకోసం మరొకర్ని బాధపెట్టటం మరీ బాధ. ఆనాడట్లా నాతో రాకపోతే మరో మంచివాణ్ణిచూసి పెళ్ళిచేసుకుని సుఖపడేదానివి నువ్వు.

కళ—ఏమో! పెళ్ళిచేసుకొని సుఖమే పడేదాన్నో, కష్టమే పడేదాన్నో? ఆ రోజు నాకిష్టమై నేను వచ్చాను. ఇష్టమైన పని చేయడం కష్టమనిపించదు. ఇష్టపడి మంటలో దూకినా మంట వంటికి అంటదు. ఇష్టం లేనిపని తేలిగ్గా చేయగల్గినా, మనసుకు కష్టంగానే వుంటుంది.

మనో—అందుకనే కాబోలు నాకీ కష్టం! కళా, ఆవేళ నిన్ను తీసు కెళ్ళటంలోగాని, తర్వాతగాని, నాకు మంచి వుద్దేశ్యంలేదు. ఈకాలూ చెయ్యి పడిపోకపోతే అధోగతి పాలు చేశేవాణ్ణో ఎక్కడ నిన్ను వదిలేసి ఏదేశాలు పోయేవాణ్ణో! నిన్నెప్పుడూ ఒక ఆటబొమ్మగా చూశే వాణ్ణి "నా మాటలు నమ్మి ఏం చెపితే అది చేసే వొక తెలివి తక్కువ ఆడపిల్లగా" అనుకునేవాణ్ణి. నా పాపానికి ప్రతీకారం భగవంతుడు ఈలోకంలోనే చేశాడు.

కళ—అయిందేదో అయిపోయింది. అదంతా ఇప్పు డెందుకూ?

మనో—ఎందుకూ కొరగాని ఈ రోగిష్టివాణ్ణి చూసి నువ్వు అసహ్యించుకొని చీదరించుకోవాల్సింది. నాతో బాధపడ్తున్నావుగాని సుఖపడటంలేదే! ఇంకా నన్నెందుకు యింత ఆపేక్షగా చూస్తున్నావు?

కళ—ఇక ఊరుకోండి, మీరు.

మనో—చెప్పు. నాదుర్మార్గం తెలియకా? నామీద జాలి వేశా? ఎందుకు? ఎందుకింకా ఆపేక్ష ?—

కళ—ఎందుకంటే ఎట్లాచెప్పటం? ఆపేక్షకు కారణం వెతికితే దొరుకుతుందా? కారణ మేదన్నా వుంటే అది వక్కటే.

మనో—ఏమిటది?

కళ—చిన్నప్పుడు నన్నొక ఆటబొమ్మగా చేసి అలా ఆడించటమే. అట్లా నువ్వు మాట్లాడుతూంటే, అనవసరపు ప్రమాణాలూచేసి నన్నాడిస్తుంటే, నాకు—బాగుండేది.

మనో—ఓ! (తెల్లబోతాడు)

కళ—అప్పుడూ, యిప్పుడూకూడ అలా వుండటమే నాకిష్టం. నన్ను సుఖపెట్టాలంటే మీరలాగే వుండండి.

మనో—కళా!

కళ—బొంబాయివెళ్ళిన కొత్తరోజుల్లో మీరసలు కంటికే కనిపించకుండా తిరిగేవారు. నన్ను ఇంట్లో వదిలేసి వెళ్ళిపోయేవారు. వంటరిగా వుండి నేను చాలా విచారించేదాన్ని "నేనెందుకు యీ పాడుపని చేశానా? ఎందుకు

మీతో వచ్చేశానా అని'' ఎప్పుడూ ఏడుస్తూ కూర్చునే దాన్ని. మీకీ జబ్బువచ్చింది. ఆశలన్నీ వాడిపోయి నాయి. కాని మిమ్మల్ని చూస్తే బాధగానూ వుండేది. సంతోషంగానూ వుండేది. జబ్బుతో ఇక ఎల్లకాలం మీరు నాదగ్గరే వుంటారుగదా, అని లోలోపల సంతోషించే దాన్ని. నన్ను సరిగ్గా అర్థంచేసుకోండి. ఇక ఎప్పుడూ ఈజన్మకి సంతోషంగా వుండండి. అదేచాలు, నా సంతోషానికి.

(కమలాకరం, ముకుందం బయటనుంచి వస్తారు)

ముకు—ఏదో భార్యాభర్తలు మాట్లాడుతున్నారే!......
నీపనిమీదే వెళ్ళి వచ్చారా, మనోహరం! పొద్దుట్నించీ ఆఫీడరుగారిదగ్గరే సరిపోయింది. ''రిజిష్టరు Marriage అన్నా చేసుకోవాల్సిందే'' అన్నారు, ఆయన.

మనో—ఊఁ!

కమ—అయినా, ఇది యిప్పుడు తలపెట్టేరేం?

కళ—చేసినపాపం కడుక్కోటానికి.

కమ—ఎందుకు కళా, ఇంకా అంతకష్టంగా మాట్లాడతావ్.

కళ—మాట్లాడకపోవటానికి ఇప్పుడేం మారిందంటావ్? పొరపాటునో, గ్రహపాటునో ఒక తప్పుచేశాను. ఇప్పుడెంత పశ్చాత్తాపపడినా, లోకం—క్షమించదు.

కమ—లోకం క్షమించకపోవటానికి నువ్వేం ద్రోహం చేశావ్! ప్రేమించినవాడిని కనిపెట్టుకొని వున్నావ్.

వాడేం చేసినా భరించాను, వాడికోసం నానా అవస్థలు ఇప్పటికీ పడుతున్నాను. అంతకంటే ఏ చేసుకున్న భార్య అయినా ఎక్కువ చేస్తుందా?

కళ — ఏమో! కాని ఇది యింతే. ఈజన్మకి మరవగలిగింది గాదు. తోటివారిలో తలఎత్తుకు తిరిగేరాత ఇక లేదు.

కమ — ఆ, నీమనసులో బాధ కాని, లోకం నిన్నేం చేస్తుంది? ఏం చెయ్యగలదు?

కళ — బాధ పెట్టేది లోకమయితే ఏం? నా మనసయితే ఏం? ఏ బాధ అయినా ఒకటే...వస్తా (వెళ్ళబోగా)

మనో — నన్నూ హోటలుకి తీసుకుపో కళా!

కళ — ఏం? వాళ్ళిద్దరూ కూర్చున్నారు. మీరు కూర్చోండి.

ముకు — మేము వెళ్తాంలే పోనీ........

మనో — మీరేం అనుకోకండి సార్... మిమ్మల్ని చూస్తుంటే వెనకటి రోజులు జ్ఞాపకం వస్తున్నాయి. అంతే!

ముకు — నువ్వెప్పుడూ ఒంటరిగా కూర్చుని ఇదవుతున్నావ్ — గనకే అదంతా మర్చిపోలేకుండా వున్నావ్. అల్లాకాదు. ఆ గదిలోనో — ఎక్కడో కూర్చుని — కొంచెం సేపు సీకాటు ఆడదాం పట్టు.

కమ — ఆ! ఆ పనిచేద్దాం —

ముకు — మళ్ళీ నేను Tour వెళ్ళేవరకు ఇప్పుడిల్లా రాను.

మనో — పదండి (ముకుందం సాయం చేయగా మనోహరం లేచి వెళ్ళును)

[మనోహరాన్ని రెండవ ప్రక్కగదిలో దింపి కళ తిరిగి వస్తుండగా వేణు వీధి వాకిట్లోంచి లోపలికి వచ్చి వుత్త రీయం వంకెకు వేస్తూ]

వేణు—పద్మ ఏదీ ?

కళ—లోపలుంది. పిలవమంటావా?

వేణు—ఆ పిలు. (కళ లోపలికి వెళ్తుంది)

[వేణూ చదువుకుంటూ కూర్చుంటాడు. పద్మ అప్పుడు నిండు గర్భవతి...ప్రవేశిస్తుంది]

పద్మ—రమ్మన్నారట...ఎందుకూ ?

వేణు—ఆ...రమ్మన్నాను. అట్లా కూర్చో.

పద్మ—ఎందుకూ ?

వేణు—ఏమిటో ! ఇవ్వాళ నిన్ను చూస్తూ కాసేపు కూర్చో వాలనిపించింది.

పద్మ—ఏం ! ఇవ్వాళ ! ఈమధ్య ఎప్పుడూ లేంది?

వేణు—ఏం లేదూ ? (నెలలు నిండిన పద్మ ఆకారాన్ని చూచి నవ్వుతాడు)

పద్మ—ఎందుకు నవ్వుతారు?

వేణు—ఏమీ లేదు. సృష్టి పక్షపాతానికి.........

(పద్మకూడా తన వికృతాకారాన్ని చూసుకొని సిగ్గుపడుతుంది.)

వేణు—ఇవ్వాళ ఈ చీర కట్టావేం ?—

పద్మ—ఏదైతే ఏం ?

వేణు—నువ్వీ యింట్లో మొదటిసారి అడుగుపెట్టింది... ఈ చీరెతోనేగా ?

పద్మ—ఆ! మళ్ళీ మా యింటికి వెళ్ళకుండా ఇక్కడే కట్టి పడేశారుగా!

వేణు—కట్లు తెంపుకుని పోవాలనుందా?

పద్మ—తెంచుకుంటే తెగేకట్లా ?

వేణు—పద్మా!

పద్మ—కూర్చోండి. అల్లా నిలబడ్డారేం ?

వేణు—(దగ్గర కూర్చుని) మనం ఎట్లా కలుసుకున్నాం! ఎట్లా కలిసిపోయాం! తల్చుకుంటే నవ్వు రావటం లేదూ? అనుకోకుండ ఏర్పడిన అనుబంధం ఈ జన్మదే అయి వుంటుందా! ఈ వక్క జన్మతో ఆగిపోతుందా!

పద్మ—ఏం మాట లివ్వి ?

వేణు—ఏమో! నీవా చీర కట్టుకున్నావ్! మరచిపోయినదంతా మనసులోకి వచ్చింది. నిన్ను నా భార్యగా చూచిన మొదటి క్షణంలో నా మనసేదో తలక్రిందులై పోయింది; ఇవ్వాళా అల్లాగే అవుతోంది.

పద్మ—పాపం. ఇన్నాళ్ళు మిమ్మల్ని చాలా కష్టపెట్టాను.

వేణు—కాని, ఇన్నాళ్ళు పడింది కష్టమేనా అని !

పద్మ—మీరనే మాటేగా? కూరలైపోయాయన్నా కేక లేశావారు.

వేణు—అదా!

పద్మ—నే నొచ్చాక అవి కావాలనీ, ఇవి లేవనీ, మరోటి అయిపోయిందనీ. వేధిస్తున్నాను. అదివరకు కందిపచ్చడి వేసుకొని, పచ్చి పులుసు నంచు కుంటే సరిపోయేది.

వేణు—(నవ్వి) అవును. సోలెడు గిన్నె మానెడు అయింది.

పద్మ—పాపం! ఈ అయిదారు సంవత్సరాలూ చాలాకష్ట పడ్డారు నా కోసం.

వేణు—ఎప్పుడు కష్టపడలేదు గనుక...ఇప్పుడు మాత్రం కష్టపడటంలే? కాని ఇదంతా కష్టమేనా అనే సందేహం అప్పుడప్పుడూ వస్తూంటుంది. ఇంకా బాగా ఆలోచిస్తే అల్లా కష్టపడటమే సుఖ మనిపిస్తుంది. ఓ భగవంతుడు చేదులో ఇంతతీపి కలిపాడేమా అనిపిస్తుంది.

పద్మ—ఇవ్వాళ పాఠంలో అంతా వేదాంతం వచ్చినట్టుంది.

వేణు—కాదు. ఇద్దరు ముగ్గురు జీతాలు తెచ్చి యిచ్చారు. జేబు నిండా డబ్బు వుందిలే.

పద్మ—అల్లా చెప్పండి! జేబు ఖాళీ అయితే, మనస్సు ఖుస్సు బుస్సు మంటుంది. (ఇద్దరూ నవ్వుకుంటారు)

వేణు—మనస్సు తెలసి మాట్లాడే భార్య దొరికితే, జీవితాని కెంత హాయి! లయలో కలసి పాటపాడినట్లు పద్మా! నువ్వు నా భార్యవు కాకపోతే ఈజీవితం ఎట్లాగడిచేదో?

పద్మ—అబ్బ! ఎందుకు అనవసరంగా అంత భయంవేసే మాటలంటారు?

వేణు—బహుశా, నిరాశతో నే నెప్పుడో వాడి, ఎండి, రాలిపోయేవాణ్ణి. అంతేగా! బ్రతుకుకు మొగ్గలు చిగి

ర్చావ్. జీవితంలో మాధుర్యాల నొలకించావ్. మంద మంద మధుర నినాదాన్ని వినిపించావ్.

పద్మ—ఎంతడబ్బు జేబులోవున్నా అంత వళ్ళు మర్చిపో కూడదు. ఆ జేబులో డబ్బు ఖర్చుపెట్టండి. కావాలంటే.

వేణు—మరీ అంత ఎక్కువగా మాట్లాడానా నేను ?

పద్మ—లేకపోతే ఏమిటీ చిన్నపిల్లల్లాగా !

వేణు—నిజమే ఎక్కువగానే మాట్లాడాను. నాకూ సిగ్గుగానే వుంది.

పద్మ—ఎవరో వస్తున్నారు.

వేణు—మీ నాన్న, వాళ్ళు అదుగో.

[సాముద్రికపు తాత, రాజగోపాలం పిల్లాడితో వస్తారు]

రాజ—ఇవ్వాళ బజారులో కావల్సింది ఒక్కటీ దొరకలేదు.

వేణు—మీ సంచీలు చూస్తే అల్లా కన్పించడం లేదే: నిండుగా వున్నాయే.

రాజ—ఇవ్వా...ఆ. ఏం తోచక అవ్వీ యివ్వీ కొనుక్కు వచ్చాం అబ్బాయికి.

వేణు—ఇవి చాలూ? యింకాసిని కొనక పోయూరూ!

సాము—నువ్విట్లాఅంటావనీ ఆయనభయసడుతూనెడున్నారు. ఈ రెండు సంచులూ అబ్బాయివి లే, యీ మూడో సంచి పండ్లు పద్మకి.

వేణు—మరి నాకో! నాకేం లేవన్న మాట!

పద్మ—వారికూ్కడా కొనుక్కు రాక పోయూరూ. రెండు బూరలో, రెండు బుడగలో.

రాజ—అనుకున్నాం సుమా, పేను బెత్తాలు తీసుకువద్దామను కున్నాం.

వేణు—నాకు పేను బెత్తాలెందుకు ?

సాము—మేష్టరుగారికి పనికి వచ్చేవి అవ్వేగా ? బడిపిల్లల్ని కొట్టటానికి. (నవ్వుతారు)

రాజ—ఆ ఇంగువా కస్తూరీ ఎక్కడ పెట్టారూ ?

తాత—ఇదిగో జేబులో జాగ్రత్తగా వుంచాను.

కమ—(ప్రవేశించి) నీకోసమె వచ్చారా వేణూ నువ్వింట్లో లేకపోతేనూ, అక్కడ వాళ్ళతో పేకాడుతూ కూర్చున్నా.

వేణు—నే నిందాకణ్ణించీ ఇంట్లోనే వున్నా నే

కమ—నే న్నువ్వు రాకముందే వచ్చాలే. నువ్వు రావటం నేనూ చూశా...గానీ...........

వేణు—కానీ ?

కమ—ఇందాకణ్ణించీ మీా భార్యాభర్తలు ఏదో మాట్లాడు తున్నారు కాదూ ? ఇప్పుడెందుకులే, అనీ, అక్కడే కూర్చున్నా. (నవ్వుతారు.)

పద్మ—(పద్మ వంట్లో బాగుండనట్టు మొహంపెట్టి) కళను ఒక్కసారి పిలవండీ, ఒక్కసారి కళనుపిలవండీ.

వేణు—ఎందుకూ?

రాజ—కళా కళా (కళ వస్తుంది)

పద్మ—(కళతో) కాస్తపట్టుకో.....లోపలికెళ్దాం.

కళ—ఏం? వంట్లో బాగాలేదా? (కళ సాయంచేయగా పద్మ లోపలికి వెళ్ళింది)

[తాతగారూ, రాజగోపాలం ఒకరి నొకరు చూచుకుంటారు "చూచారా? నేనుచెప్పలా అని తాత సౌంజ్ఞ" భగవంతుడి దయ అన్నట్లు రాజగోపాలం ఒక నమస్కారం చేస్తాడు కళ చేతిలో Flask తో తిరిగి వస్తుంది. కళతోపాటు అయిదేళ్ళ కుర్రవాడు, "ప్రసాదు" కూడా వస్తాడు. కళ రాజగోపాలానికి Flask యిస్తూ—]

కళ—రెండు కప్పులు కాఫీ తెప్పించండి, తొందరగా.
(సాముద్రికుడు కుర్రవాణ్ణి దగ్గరకు తీసుకుంటాడు)

రాజ—నొప్పులేనా?

కళ—ఆ. ఆ.

రాజ—మంత్రసానికి కబురుచేయద్దూ?

కళ—దాసీదాన్ని పంపించానులెండి.

రాజ—సరే. కాఫీ తెప్పిస్తాను. ఆహా! తెస్తాను (రాజగోపాలం గబగబ బయటకు వెళ్తాడు. కళ లోపలికి వెళ్తుంది)

వేణు—(దూరంగా ఒక కుర్చీమీద కూర్చుంటాడు. సాముద్రికుడు గమనించి వేణుదగ్గరకు కుర్రవాణ్ణికూడ తీసుకు వెళ్ళి)

వేణు—(కళ్ళనీళ్ళు తిరిగి దుఃఖంపొంగి వస్తుంది)

సాము—అదేమిటోయ్...పిచ్చివాడా. బాబూ! నాన్నదగ్గర కూర్చో అమ్మా. (వేణు కుర్రవాణ్ణి దగ్గరకు తీసుకుంటాడు)

కమ—అనవసరంగా భగవంతుడు ఈబాధ పకటి పెట్టాడు.

సాము—ప్రకృతి ప్రవర్తనే అంత.

కమ—అంతే! అంతా వైరాగ్యం!

కళ—ఇంకా (కళ గబగబావచ్చి) కాఫీరాలే ?

సాము—లేదు. ఎట్లావుంది?

కళ—బాగానే వుంది.

సాము—మంత్రసాని వచ్చిందా.

కళ—ఆ! ఇప్పుడే వచ్చింది. (లోపలికి వెళ్తుంది)

కమ—ఈతడవ ఆడపిల్లే పుట్టాలి. ఏమండీ తాతగారూ.

సాము—ఏదో ఒకపిల్ల! కులాసాగా బయటపడితే......

వేణు—(పిల్లవాణి ఎత్తుకొని రొమ్ముకు అదుముకొని) నేనొక సారి అట్లా వెళ్ళొస్తాను.

సాము—పోనీ, వెళ్ళిరా! (పిల్లాడితో వేణూ వెళ్తాడు)

ముకు—(రెండవప్రక్క గదిలోనుంచివచ్చి) ఏమిట్రా హడా వుడి ?

కమ—మరేం లేదులే........పద్మకు.........

ముకు—(గ్రహించి) ఆహా ! (రాజగోపాలం బయటనుంచి కాఫీతో వస్తాడు)

రాజ—ఎట్లావుంది ?

సాము—అప్పుడేనా !

[కళలోపల్నించి ప్రవేశించి]

కళ—కాఫీ వచ్చిందా!

రాజ—ఆ. ఆ. ఇదిగో

(కళ రాగానే రాజగోపాలం సాముద్రికుడు దగ్గర కెళ్తారు)

సాము—ఎట్లావుంది ?

కళ—పది నిమిషాలో పదిహేను నిమిషాలో (కాఫీ తీసుకు పోతుంది)

ముకు—మనం పోదామా ?

కమ—ఈ కాసేపూ ఆగి పోదాం......

ముకు—మనోహరానికి చెప్పివస్తావుండు.

[రెండవ ప్రక్క గదిలోకి వెళతాడు కమలాకరం టేబులు దగ్గర కుర్చీమీద కూర్చుంటాడు. వేణూ బయటనుంచివస్తాడు]

వేణు—ఎట్లా వుంది ?

రాజ—ఏదీ ? ఇంకా అప్పుడే !

[కళ తిరిగి వస్తుంది. అందరూ అటువెళ్తారు. కమలాకరం రెండవప్రక్క టేబుల్ దగ్గరే కూర్చుంటాడు]

కళ—ఆ మంత్రసానికి కాఫీ కావాలంటోంది.

రాజ—ఆ, ఇదిగో తెస్తా గాని ఎలావుందీ ?

కళ—ఏది యింకా ? (లోపలికి వెళ్ళుతుంది)

రాజ—(జేబులు తడుముకొని తాతగారితో) మీదగ్గర చిల్లరుందా ?

(అందరు తలో పర్సు జేబులోనుంచి తీస్తారు. తాత బొడ్లోంచి తీస్తాడు. వేణు 5 రూపాయిలనోటు జేబులోనుంచి తీసి యిస్తాడు.)

రాజ—(నోటు తీసుకొని చూస్తూ) అయిదు రూపాయ లెందుకూ? చిల్లర చాలు.

సా—నా దగ్గర చిల్లరుంది.

వేణు—ముందు పట్టుకువద్దురూ! ఏదైతే ఏం?

[రాజగోపాలం బయటకు వెళ్ళాడు. Flask తో ముకుందం రెండవ ప్రక్క గదిలోనుంచి వస్తాడు. వేణూ సాముద్రికుడూ అప్రయత్నంగా ఖంగారుపడ్తూ ఆదుర్దాలో, కళవచ్చినపుడు, వెళ్ళినట్టే ముకుందంవైపు నడుస్తారు]

ముకు—ఏం. ఎట్లావుంది?

సాము—ఏదీ? ఏం లేదు.

వేణు—పదిహేను నిమిషాలు కాలే? అయినట్లేవుందే!

కమ—కాలేదులే. నువ్వు కాస్త అట్లావెళ్ళి కాసేపు అటూ ఇటూ తిరిగిరా.

వేణు—వెళ్తా! వెళ్తా!...ఆ...వీణ్ణి మీరు తీసుకోండి.

సాము—మరేం భయంలేదు. అంతకీ భగవంతుడేవున్నాడు. శ్రీరామ రామ రామేతి (అంటూ శ్లోకం చదువుతాడు)

[వేణు బయటకు వెళ్తాడు. అతని వెనకనే సాము ద్రికుడుకూడ పరధ్యానంలో వెళ్ళబోతాడు పద్యంచదువుతూ

కమ—మీరెక్కడికీ?

సా—ఆ. ఆ. నే నిక్కడికే (వెనక్కి తిరిగివస్తాడు)

కళ—(ప్రవేశించి) ఏదీ ఇంకా కాఫీరాలే.

సాము—ఏం. ఎట్లావుంది?

[గబగబా బయటనుంచి రాజగోపాలం వస్తాడు]

కళ—అప్పుడే ?

రాజ—ఇదిగో కాఫీ.

కళ—కాస్త పంచదార ఎక్కువ వెయ్యమని చెప్పారా ?
మంత్రసానికి పంచదార ఎక్కువ కావాలిట.

రాజ—చెప్పలేదే! కావాలంటే కాస్త ఇంట్లోది వెయ్యి
(సాముద్రికుడితో) ఇట్లా ఇవ్వండి బాబును.

సాము—(కప్రవాణ్ణి ఇస్తాడు)

రాజ—వేణు ఏడీ ?

సాము—ఇప్పుడే అట్లా వెళ్ళాడు.

వేణు—ఆ ! పిల్చారా ? (వేణు గబగబా లోపలికి వస్తూ)

సాము—లేదు.

వేణు—ఎట్లా వుంది ?

సాము—(ఏదో విని) అదిగో.....

సాము } ఆ! ఆ!...
వేణు }

రాజ—అహా...ఏదో ఏడుపు విన్పించినట్లుందేనూ.

సాము—ఏం లేదే ?...

వేణు—అదిగో !

సాము—ఆ ! ఆ !

రాజ—అహా; కాదండీ !

(కాదనుకుంటూనే అందరూ ద్వారం దగ్గరకు వెళ్తారు, నిరాశగా తిరిగి వస్తారు. కాసేపు అట్లాగే ఆదుర్దాగా

నుంచుంటారు. అకస్మాత్తుగా రాజగోపాలం గబగబ ద్వారం దగ్గరకు వెళ్తాడు...అందరూ వెంబడిస్తారు. అందరూ ఒక్కసారిగా నవ్వుమొహం పెట్టి)

రాజ—అమ్మయ్య! (బాబును కౌగలించుకుంటాడు)

సాము—ఆ...ఆ...

రాజ—బ్రతికి బయటపడ్డాం...

సాము—ఆ... ఈ తడనకి...

కమ—ఏం పిల్లో!!

రాజ—ఎవరో వకరు! బాబును కాస్త తీసుకోండి.

(అందరూ తేలికబడి వూపిరి పీలుస్తారు. లోపల్నించి చేవో గోల వినిపిస్తుంది. అందరూ మళ్ళీ ఆదుర్దాగా చూస్తూయుంటారు. కళ లోపల్నించే దుఃఖంతో 'అన్నయ్యా అన్నయ్యా!' అంటూ కేక లేస్తూ పరుగెత్తుకు వచ్చి...వేణు కాళ్ళమీద పడి కౌగిలించుకొని వణికిపోతూ)

కళ—అన్నయ్యా! అన్నయ్యా! అయిపోయిందిరా అన్నయ్యా!

సాము—
రాజ— } ఆ!...ఆ!...

కళ—పద్మా!...పద్మా! (వణికిపోతూ ఏడుస్తూంది మాట రాక)

[ఒక్క క్షణం అందరూ నిస్తబ్ధులై నిలబడిపోతారు. బిగ్గరగా దుఃఖంతో కేక లేస్తూ లోపలికి పరుగెత్తుతారు]

రాజ—పద్మా!...పద్మా! (దుఃఖంతో లోపలికి పరుగెత్తు తాడు).

(మనోహరం రెండవ ప్రక్క గదిలోంచి గబగబా ఆదుర్దాగా కుంటుకుంటూవచ్చి)

మనో—ఏమయింది? ఏమయింది? (అంటూ వచ్చి రంగ స్థలం మీాద పడిపోతాడు.)

[కళ, ముకుందం మనోహరాన్ని లేవదీస్తారు. వేణు, రాజగోపాలం వెళ్ళటం,—మనోహరం రావటం, ఒక్కసారి జరిగిపోతుంది. తాత పిల్లాణ్ణి కమలాకరం చేతికిచ్చి గబ గబా లోపలికి వెళ్తాడు]

కమ—డాక్టర్ని ఎవర్నన్నా పిలిస్తే?

కళ—ఇంకేం డాక్టరు?...పిల్ల చచ్చిపోయింది. తల్లికి వాతం కమ్మికొచ్చింది.——రక్తం——కళ్ళు తిరిగి పోయాయి. (దుఃఖిస్తూ వేణు తిరిగి రాగా...అతన్ని కౌగిలించుకుంటూ)

కళ—అన్నయ్యా! అన్నయ్యా!

(వేణు కుర్రవాణ్ణి చూసి కళను తప్పించుకొని)

వేణు—బాబూ...బాబూ—అమ్మ—అమ్మ—అమ్మ.— నన్నూ నిన్నూ...ఈ లోకాన్ని...విడిచి వెళ్ళిపోయింది బాబూ.........

అందరూ—వేణూ, వేణూ.

వేణు—మనల్ని, కాకుల్లాగా ప్రపంచంలో బ్రతకమని కన్ను మూసిందిరా మీా అమ్మా!

కళ—అన్నయ్యా!
అందరు—వేణూ!

[సాముద్రికుడు గబగబా ప్రవేశిస్తాడు]

వేణు—నిన్ను చూశైనా జాలిపడకుండా మమకారమంతా విడిచి మరణించిందిరా బాబూ!

సాము—వేణూ!

అందరూ—వేణూ!

వేణు—ఓ! కఠినాత్ములారా! పోయి, ఏం సుఖపడతావో సుఖపడు. ఎవరు రమ్మన్నారో, వెళ్లు, ఏం పుట్టిమునిగిపోయిందని, పోతున్నావో, పో!...

సాము—(కంఠం వణుకుతూ) ఆగు వేణూ! అన్నింటికి ఆభగవంతుడే వున్నాడు.

వేణు—భగవంతుడు! పచ్చని కాపురాన్ని బూగ్గులు చేసే భగవంతుడు; నిండుజీవితంలో నిప్పులుపోసే భగవంతుడు. నవ్వే పద్మాన్ని చూసి కన్నెఱ్ఱచేసే కఠినాత్ముడు! అహా! నిషాదుడా, ఇంతకంటే నీకెవ్వరూ కనిపించలేదటయ్యా? ఈ పసివాణ్ణి చూచైనా కనికరించలేవా? తండ్రీ, రగిలే కుంపటికే ప్రపంచంలో ఎక్కడ చోటు దొరకలేదటయ్యా? (దుఃఖలో వివశుడై పడిపోతాడు)

[కుర్రవాణి కమలాకరం బైటికితీసికెళ్ళబోగా, వేణు కుర్రవాడిమీద పడి దగ్గరకు లాక్కుని, కౌగిలించుకుంటాడు.]

సాము—ఊరుకో నాయనా! శాస్త్రకుదుటపడు; నువ్వేయిట్లా అయితే ఎట్లా?

వేణు——పద్మా!

సాము——అయ్యయ్యో ఆగు; నామాటవిను.

వేణు——(కుర్రవాణ్ణి వదిలేసి ముందుకువస్తూ దుఃఖంతో) ఎందుకింక ఆగటం? ఏం మాటవినటం. ఇక ఈ ప్రపంచ మంతా అంధకారం, అంతులేని, ఆశలేని. జీవితమంతా అంధకారబంధురం.

[కుర్రవాణ్ణి కమలాకరం దగ్గరకు తీసుకొని నిమ్మదిగా బయటకు వెళ్ళిపోతాడు.]

సాము——నువ్వుకూడా యిట్లా అయితే ఎట్లావేణూ?

వేణు——ఈ ఈ దుఃఖంలో కుమిలి, కుమిలి గుండెలు బ్రద్దలై పోతే ఎంత బాగుంటుంది!

సాము——అయ్యయ్యో! నువ్వే యిట్లా అయితే పిల్లవాడేం కావాలి? వాడిసంగతి ఎవరుచూస్తారు?

వేణు——పద్మా.........పద్మా.........

సాము——వెళ్ళిపోయింది. వెళ్ళిపోయింది, నాయనా వెళ్ళిపో యింది. మనల్నందర్నీ అంధకారంలో ముంచి వెళ్ళిపో యింది. ఈ భవబంధాల్ని తెంచుకుని.........వెళ్ళి పోయింది. అందరం వెళ్ళిపోతాం, కొందరం ముందర, కొందరం వెనక. అంతే. (No. 1) ముందు వెళ్ళిపోయిన వారే అదృష్టవంతులు. ఈ సంసారపు వృక్షపువేళ్ళు ప్రపంచంలో ఎట్లా పెనవేసుకొని కల్సివుంటాయో ఎవరికీ తెలియదు. తెలివిగలది గనక తెలుసుకొని, తెంపుకొని పద్మ వెళ్ళిపోయింది. (No. 2—3)

వేణు—పద్మా..............పద్మా...............

సాము—కాలం పిలచింది. పిలుపువిని వెళ్ళి పోయింది. ఎవరి కాలానికి వారు వస్తారు. (No. 4) కాలం తీరంగానే వెళ్ళి పోతారు. ఎక్కణ్ణించి వచ్చామో ఈ ఋణానుబంధాన్ని తెంచుకొని ఎక్కడికి వెళ్తామో దాన్ని గూర్చి ఈ పరిదేవన మెందుకు? మనిషి మాసిన బట్టలు వదలేసి క్రొత్త బట్టలు కట్టుకున్నంత తేలిగ్గా, (No. 5) పద్మకూడా దేహాన్ని పరిత్యజించి, మరో శరీరాన్ని ధరించటానికి వెళ్ళింది. పుట్టిన తర్వాత చావు ఎవ్వరికీ తప్పదు. జీవితంలో కొన్నాళ్ళు బాల్యం. కొన్నాళ్ళు యౌవ్వనం, కొన్నాళ్ళు వృద్ధాప్యం మాదిరిగానే మరణంకూడ వక దశ. చావుకూడ జీవికి సహజమైన పరిణామం (No. 6) ఉత్పత్తి వినాశాలు ప్రకృతి సహజ లక్షణాలు.

వేణు—ఓ! ఇల్లా విడివడే వాటికి కల్సుకోవట మెందుకు? ఎందుకీ మూన్నాళ్ళ పండుగ? చంపేకాడికి అసలు సృష్టించక పోతే ఏం?

తాత—కేవలం మమకారంలో పడిపోతున్నావ్ వేణూ! (No. 7+8) ఈ కర్మతోగాని, కర్తృత్వానికిగ్గాని ఈశ్వరుడికేం సంబంధం లేదు. ప్రకృతిలో ఒక భాగం ఈ శరీరం. ప్రకృతితో కొట్టుకు పోవాల్సిందే! ఈ శరీరాలు ప్రకృతి ధర్మాన్ని నిర్వర్తించటానికే ఈ శరీరాలు. మనం వేరు. ఈ శరీరాలు వేరు. ఆత్మకీ యీ శరీరానికీ

పూలచెండులోని దారానికీ పూలకీ గల సంబంధ మాత్రమే! ఆత్మ అనే సూత్రం అనేక జీవిత కుసుమా ద్వారా సదా ప్రవహిస్తుంది. దారానికి పూలను గుచ్చి చెండుగా చేరిస్తే కన్నులు పండువుగా కన్పిస్తుంది (No. 9) కాని పువ్వులతో దారం ఎప్పుడూ కలసిపో టంలేదు. పువ్వులు వాడి, రాలిపోయిన దారం అక్క వుంటుంది.

వేణు—అందుకని ఈ ప్రపంచములో ఏదీ నాదికాదనుకొ జీవించాలి. కాని ముందంతా అంధకారం. అంధకారంల ముందు తడుముకుకుంటూ ఎన్నాళ్ళని బ్రతకను? ఏ చూసుకొని బ్రతకను? శరీరంలో, శరీరం. ప్రాణంలో ప్రాణం, పద్మ పోయిం తర్వాత ఎందుకని బ్రతకను ఎలా బ్రతకను?

తాత—పద్మపత్రమివాంభసా (No. 10) భవబంధాలు సహ జంగానే భావించి, వాటితో బాధపడినా భయపడకుండ మనం ప్రవర్తించాలి. ఈ కష్టసుఖాలు ఈతిబాధలూ అన్నీ, మనల్నంటకుండా చూసుకుంటూ జీవించాలి.

వేణు—నాకేం మిగిలింది? బ్రతికి ప్రయోజన మేమిటి? ఏ చూచుకొని ఏం ఆశతో జీవించను?

తాత—ప్రపంచంలో జీవించటమే సహజం కనుక జీవించాలి ప్రకృతి నిర్దేశించిన ప్రయోజనం కోసమేజీవించు. పనిలే పోయినా బాధ్యత వుంది. అదిగో! నీ బాధ్యత. అదే బాధ్యత.

[కుర్రవాడ్ని ఎత్తుకుని కమలాకరం వీధి ద్వారంలో కన్పిస్తాడు]

వేణు—బాబూ, బాబూ, (అంటూ దుఃఖిస్తూ వెళ్ళి కుర్ర వాడ్ని ఎత్తుకుని నిలబడతాడు)

తాత—రండి (కమలాకరంతో) ఆ రాజగోపాలంగార్ని ఇవతలకి తీసుకువద్దాం

(అందరు వెళ్తారు—వేణు ఒక్కడే కుర్రాడ్ని ఎత్తుకు మిగిలిపోతాడు)

—: తెర :—

---

## అ ను బ o ధ o

ఐదవరంగంలో సాముద్రికం తాత వేణును ఓదారుస్తూన్నపుడు ఆ అర్థాన్నిబట్టి ఈ క్రింద యివ్వబడిన భగవద్గీత శ్లోకాలు సన్నగా దూరాన్నించి రాగ యుక్తంగా పద్మ కంఠస్వరంలో విన్పిస్తే రక్తిగా ఉంటుంది. సాముద్రికపు తాత మాత్రం నిశ్చలంగా గంభీరంగా సంభాషించాలి. నంబర్లు యిచ్చిన ప్రకారం శ్లోకాలు చదవాలి.

1. 15 వ అ॥ 2 వ శ్లో॥

అథ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖాః
గుణప్రవృద్ధా విషయప్రవాళాః

అధశ్చ మూలా న్యనుసన్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే.

2. 15 వ॥ అ॥ 3 శ్లో॥

న రూప మస్యేహ తథోపలభ్యతే
నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా
అశ్వత్థ మేనం సువిరూఢ మూల
మసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్త్వా

3. 15 వ అ॥ 5 వ శ్లో॥

నిర్మానమోహా జితసఙ్గదోషాః
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వంద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛన్త్యమూఢాః పద మవ్యయం తత్

4. 2 వ అ॥ 28 వ శ్లో॥

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా.

5. 2 వ అ॥ 22 వ శ్లో॥

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ.

6. 2 వ అ॥ 13 వ శ్లో॥

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాన్తరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి.

7. 2 వ అ॥ 27 వ శ్లో॥

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహా ర్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

8. 5 వ అ॥ 14 వ శ్లో॥

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః,
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే.

9. 7 వ అ॥ 7 వ శ్లో॥

మత్తః పరతరం నాన్య త్కిఞ్చి దస్తి ధనఞ్జయ,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.

10. 5 వ అ॥ 10 వ శ్లో॥

బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్ర మి వామ్భసా.

# ఆరవ రంగము

[14 ఏళ్ళ తర్వాత : వేణు టేబుల్ దగ్గర కూర్చు ఏదో వ్రాసుకుంటున్నాడు. తల కాస్త నెరిసి వుంది. క పటికి కళ......కళతో పాటు మనోహరం, కూతురు వా 14 సం॥రాల పిల్ల వస్తారు]

కళ—అన్నయ్యా!...

వేణు—ఆ.

కళ—ఇల్లా కూర్చున్నావేం?

వేణు—ఏం లేదు.

కళ—ప్రసాద్ ఇంట్లో వున్నాడా?

వేణు—ఆ గదిలో వున్నట్టున్నాడు.

కళ—అన్నయ్యా (ఏదో చెప్పబోయి ఆగుతుంది.)

వేణు—ఏం?

కళ—నీతో ఒక సంగతి మాట్లాడాలి.

వేణు—ఏమిటది?

కళ—ఆదే...మన ప్రసాద్ సంగతి.

వేణు—ఆ.

కళ—ప్రసాదు పెద్దవాడయ్యాడు. ఈ నెలతో వాడికి ప నిమిదేళ్ళు వస్తాయి.

వేణు—అయితే.

కళ—అహా...మరేం లేదు. పద్మ చనిపోయేనాడుకూడా.

వేణు—అవ్వన్నీ ఇప్పుడెందుకు ?

కళ—అవున్లే. కాని...వాణికీ...ఈడు వచ్చింది. మరిదాని సంగతి ఇక గట్టిగా ఆలోచించక తప్పదు.

వేణు—వేరే ఆలోచించేదేముంది.

కళ—ఆలోచించేది లేకేం ? ఏదో మా జన్మ లిట్లా వెళ్ళి పోయినాయి. నీ మంచితనాన యీ మాత్రంగా రోజులు గడపగలిగా. ఇక దాన్నొకరి చేతిలో పెట్టి, మమ్మల్నది తిట్టకుండా...తప్పించుకోవాలిగా.

వేణు—ఇప్పుడు దానికి అడ్డమేమిటి ?

కళ—మా జన్మ లే అడ్డం.

వేణు—అలా అంటావేం ?

కళ—"లేచివెళ్ళినదాని కూతురుకు, మంచి సంబధం ఎక్కడ్నించి వస్తుంది ?

వేణు—వేరే సంబంధం ఎందుకూ ? మన బాబుకు......

కళ—ఏమో ? ఏం చేస్తావో...దీన్ని నీ కాళ్లమీద పడే స్తున్నా. ఏం చేసినా సరే...నీదే భారం.

వేణు—వూరుకో కళా ! నాకు వాణి వకటీ...ప్రసాద్ వక టీనా ? లే...వాణీ...ఆ గదిలో ప్రసాద్ వున్నాడు... ఒకసారిటు పిలు. (వాణి ఆ గదిలోకి వెళ్తుంది)

వేణు—నువ్విలాంటి పని ఇక ఎప్పుడూ చెయ్యకు కళా ! అయిపోయిందంతా అయిపోయింది. అదంతా ఏకరువు

పెట్టి ఈ చిన్నపిల్లల మనసుకూడా పాడుచేయటం ఎందుకూ ?

మనో—నేను మొత్తుకుంటూనే వున్నా. మాట వినిపించు కుంటేనా !

కళ—మాట విన్పించుకోని మాట నిజమే, కాని దాని సంగతి ఆలోచిస్తుంటే కడుపు చెరువై పోతూంది.

మనో—ఎందుకూ ? ఎప్పటికైనా వుండనేవుంది; గుప్పెడు మందుతో మూడు ప్రాణాలు గుటుక్కుమంటాయి.

వేణు—ఏమిటీ మాటలు ? మీ కేమన్నా మతిపోయిందా ఏమిటి ?

[రాజగోపాలం సాముద్రికుడూ వస్తారు]

రాజ—(వేణు మాటలు విని) మతి సంగతేనా ? అందరికీ పోయింది. ఆ కమలాకరానికి బొత్తిగా పోయింది.

కళ—కమలాకరం మీకు కనిపించాడా ?

రాజ—ఆ ! కనిపించాడు...కనిపించి...(అర్థోక్తితో)

సాము—బాగానేవుంది, మతిపోయిన వాడి మాటలు విని, మీరంతా ఇదవుతారేమిటి ?

రాజ—(ఆగి) అవున్లెండి...అంతే.

వేణు—కమలాకరం కన్పించి ఏమన్నాడు ?

రాజ—ఏదో అన్నాడు.

సాము—ఏదయితే యేం? అంటే అన్నాళ్లే. ఇంతకూ బాబేడీ? ఎక్కడున్నాడు ? పొద్దుట్నించీ కన్పించటం లేదు.

[వాణిని ప్రసాదు...చెయ్యిపట్టుకు లాక్కొచ్చి]

ప్రసా—నా గదిలోకి రావద్దని చెప్పానా ? రావద్దని చెప్పినా ఎందుకొస్తావ్ ? నీ చోట నువ్వు పడివుండక...నా దగ్గరి కెందుకొస్తావ్? పడి వుండిక్కడ. (తోస్తాడు. వాణి వేణు పాదాల దగ్గర పడ్తుంది.)

వేణు—ఏమిట్రా యిది ?

ప్రసా—ఏముంది ? ఎప్పుడూ చెప్పేదే! రావద్దంటే వస్తుం దెందుకూ ...మాట మాట్లాడితే "బావ బావ" అను కుంటూ?

వేణు—వస్తే మాత్రం తప్పేముంది.

రాజ—తప్పు లేదు, వప్పు లేదు. కుర్రతనంలో వాళ్ళు కొట్లాడు కుంటేనూ తప్పు లేదు...ఏమంటారు ?

సాము—అంతేగా.

ప్రసా—(వెక్కిరిస్తూ) అంతేగా ! అంతే కాదులెండి. ఇంకా చిన్న వాళ్ళమా ఏమిటి...సంగతి తెలియక పోవటానిక్కి? (వాణితో) నేను వేళాకోళానికి అనటంలేదు. జాగ్రత్త.

మనో—(కోపంతో గట్టిగా) కళా !...ఇక పోదాంరా.

ప్రసా—అబ్బో ! (వాణితో) మీ నాన్నగారికి కోపం వచ్చి నట్టుంది. కోపం వస్తే తలకొట్టి మొలెయ్యలేడనీ ... ఆయనగారి బ్రతుక్కి అంత ఆగ్రహం పనికిరాదని చెప్పు.

సాము—(ప్రసాద్ దగ్గరకెళ్ళి) తప్పు నాయనా. పెద్దవాళ్ళని అలా అనకూడదు.

ప్రసా—ఆ...ఆయన వక పెద్ద...మీరొక పెద్దలూ !
వేణు—ఏమిట్రా వాగుడు ?

[ప్రసాద్ తండ్రివంక నిర్లక్ష్యంగా చూసి రెండవప్రక్క గదిలోకి పోతాడు]

రాజ—వాడిమాటలే అంత...ముక్కుమీద కోపం.
సాము—అసలు వాడి అందమే అందులో వుంది.
వేణు—మీరూరుకోండి. మీవల్లే వాడిట్లా తయారవుతున్నాడు.
రాజ—ఏం? ఇప్పుడెట్లా తయారయ్యాడు?
వేణు—చూట్టంలే? వాళ్లు పొగరుమాటలు, పెద్దా చిన్నా లేకుండా.
రాజ—పెద్ద!...చిన్న!...బుద్ధిగల...పెద్దవాళ్ళయితే చిన్నవాళ్ళేమనగలరు ? వాడేం జేబుల్లోంచీ, పెట్టెలోంచీ డబ్బులు కొట్టెయ్యటంలే; అడ్డమయిన వీథుల్లో చెడతిరగటంలే; ఆడపిల్లల్ని లేవతీసుకుని పరుగెత్తటంలే.
మనో—నాన్నా.
రాజ—నాన్న ... కుర్రవాడేదోమాట అంటే అంతకోపం! నువ్వు నన్నన్న మాటల్లో యిదెన్నోవంతురా ?
సాము—మీరూరుకోండి; ఇప్పుడవన్నీ ఎందుకు?
వేణు—అవన్నీ అక్కర్లేదు, నిజమే. కానీ వాణ్ణి కాస్త మందలించకపోతే ఎట్లా.
రాజ—(వేణుమీదకూడా కోపంతో) వీల్లేదు. మందలించటానికి వీల్లేదు. మేం బ్రతికివున్నంతకాలం వాణ్ణి మాటకూడా అనటానికి వీల్లేదు.

వేణు—ఆ! అయితే, తయారవుతాడు, పీడుకూడా......

సాము—అబ్బాయ్, విను నువ్వు, (తన గుండెలమీద చెయ్యి వేసుకొని) ఇక్కడ ఏముందనుకున్నావ్! నాగుండెలు కాదూ? కాని గుండెల్లో ఏముంది? ఈముసలిగుండెలు రెంటిలోనూ, వాడే మసలుచున్నాడు. మాచిన్నతనంలో మా పిల్లల్ని మే మెలా పెంచామో మాకిద్దరికీ జ్ఞాపకంలేదు. కాని వీణ్ణి మా అరచేతుల్లో పెంచాం మీరే మన్నా వాణ్ణి కేక లెయ్యదల్చుకుంటే మా ఇద్దరి ప్రాణాలు పోయింతర్వాత......కానివ్వండి.

వేణు—మీకు నానోరు ముయ్యటంతప్ప మరేం చేత కాదు.

(కమలాకరం వస్తాడు)

కమ—ఓ! అందరూ ఇక్కడే వున్నారే.........వేణూ! ఒకసారి ఇలావస్తావా?

సాము—కమలాకరం. ఆగు! ఒకమాట చెపుతా, ఇట్లారా.

కమ—అక్కర్లే! మీరు చెప్పేది నాకు తెల్సు. ప్రసాదుచేసిన పని వేణుతోటి చెప్పవద్దనేగా!

రాజ—చెప్తే చెప్పు. బెదరిస్తావేం? మీ అమ్మాయి దేంతప్పు లేకుండా తప్పంటావా? మావాడి దయినట్లు మాట్లాడతావేం?

కమ—మీవాడిది తప్పు కాదూ? ఈ ఉత్తరం చూడరాదూ! మా అమ్మాయికోరి, వలచి పిలవగా వ్రాసిందో, ఒళ్లు మదమెక్కి మీవాడు రాశిందో, దాంట్లోనే తెలుస్తుంది గా.

వేణు—ఉత్తరమేమిటి ?

కమ—చూడు, ఇదిగో, నీవాడు నా అమ్మాయికి ప్రేమ విన్నపం పెట్టుకున్నాడు.

వేణు—మావాడా!!

కమ—ఆ! చూడబోతే గట్టిగా పద్దెనిమిదేళ్ళు లేవు. అప్పుడే పాడుబుద్ధులు.

వేణు—ఊఁ! చాలావరకూ వచ్చిందే!

కమ—సరిగ్గా చదువు. కుర్రవాడి బుద్ధిచాంచల్యం బాగా తెలుస్తుంది. ఇంకోసారైతే ఈపాటికి చాలావరకు వచ్చేది. కానీ కుర్రాణ్ణిమాత్రం అదుపులో పెట్టుకోండి. అది చెప్దామనే వచ్చా (వెళ్తాడు)

వేణు—ఊఁ! ప్రసాదు నిట్లా పిలవండి.

రాజ—ఎందుకూ ?

వేణు—వాణ్ణిట్లా పిలవండి ముందు (తనే వెళ్ళబోగా)

సా—వేణూ ! ఊరుకో.

వేణు—ఎందుకూ ? ఇంకా ఊరుకోమంటారా ? ఇన్నాళ్ళూ ఎందుకు ఎందుకని ఊరుకున్నాను. ఇంకా ఊరుకోమంటారా?

సాము—ఊరుకో! చచ్చిన ఆ తల్లికోసం కాకపోయినా బ్రతికున్న మాకోసం ఊరుకో. మేం నిమ్మదిగా చెప్తాంగా! నువ్వూరుకో..

వేణు—సరే! ఈ పిచ్చి వేషాలు ఇక కట్టిపెట్టమనండి. నేను "వాణి" ని పెళ్ళిచేసుకోవాలనికూడా చెప్పెయ్యండి.

రాజ—వాణిని పెళ్ళిచేసుకోవటం వాళ్ళి కిష్టంలేకపోతే!...

వేణు—ఇష్టం లేకపోవటాన్కి కారణం వుండాలిగా?

రాజ—ఇష్టం లేకపోవటానికి కారణం ఇష్టం లేకపోవటమే. అంతకంటే కారణం వుండదు.

వేణు—వాళ్ళి యిష్టానికి ఆటలాడటాన్కి యిక్క డెవ్వరూ కాచుకుని లేరు. ఛీ! "ప్రపంచాన్ని మరచిపోయి బ్రతుకు దామనుంటే బ్రతకనివ్వరు. (వెళ్ళబోతాడు)

కళ—అన్నయ్యా! మే మిదివరకే చచ్చి సగమయ్యాం. మా కోసం మీ మనసులు కష్టపెట్టుకోకండి. మాఖర్మం దాని ఖర్మం ఎలా రాశి పెట్టి వుంటే అలా జరుగుతుంది. దాని బ్రతుకన్నా బాగుపడుతుందేమోనని ఇన్నాళ్ళూ ఆశపడ్డాను. ఆ ఆశ నిరాశ అయిన తర్వాత ఇక ఎలా బ్రతికినా వకటే! అసలు బ్రతక్కపోయినా వకటే...

వేణు—మరేం పర్వాలేదులే కళా. వాణికి పెళ్ళిచేసే బాధ్యత నాది.

కళ—కాదన్నయ్యా. ఇష్టం లేనివాణ్ణికట్టుకు వాణిమాత్రం ఏం సుఖపడ్తుంది? వద్దులే! మమ్మల్నిలా వదిలెయ్యి (మనోహరంతో) ఇక పదండి వెళ్దాం.

మనో—వెళ్దామా! పద...రా, వాణీ...

కళ—అదెందుకు? దాన్ని ఉండ నివ్వండి...

మనో—అహా...రానీ...దాన్నికూడా.

కళ—వద్దు. తాతగారి దగ్గర వుంటుందిలెండి. కాసేపు. పదండి.

మనో—ఊఁ, పద. (ఇద్దరూ వెళ్తారు)

వాణి—తాతయ్యా!

రాజ—అవతలికిపో. నాకు నీ మొహం చూపించకు.

వాణి—ఎందుకు తాతయ్యా? నాన్న మీద కోపం నామీద చూపిస్తా వెందుకూ?

రాజ—ఎందుకా?...(కోపంలో మాట రాక వుడుకుంటాడు)

వాణి—ఆ...ఎందుకు నే నెప్పుడన్నా నీమాట కాదన్నానా? ఎదురు చెప్పానా? చెప్పిన పని చెయ్యలేదా? పిల్చి నప్పుడు పలక లేదా?

రాజ—(మాట్లాడడు)

వాణి—నా బ్రతుకే అంత అసహ్యమయితే గొంతు నులిమి పారెయ్యాలిగాని ఇల్లా.....మా అమ్మనూ నన్నూ కాల్చుకు తింటారేం?

వేణు—ఆయనల్లా అంటే అన్నారులే, వాణీ రా. నేనున్నాను. ఫర్వాలేదు రా. (వాణిని బయటకు తీసుకుపో బోగా)

రాజ—అయితే ఈ పెళ్ళిచేయక తప్పదన్నమాట.

సాము—తప్పదని కాదు. అంతా ఆలోచించి ఏదో వొకటి చేద్దాం.

వేణు—(ఆగి) ఆలోచించటాని కేముంది? ఈ పెళ్ళి అయితేనే అందరికీ అనుకూలం.

రాజ—నీ కనుకూలమయితే అయింది. కుర్రాడికి యిష్టముండకపోతే!

సాము—వాడిదేముందండీ ? నిమ్మదిగా నచ్చచెపుదాం.

రాజ—నచ్చచెప్పి వాణ్ణి నప్పిస్తే సరే; వాడొప్పుకోకపోతే మాత్రం నే నొప్పుకోను.

సాము—అంతా తర్వాత ఆలోచిద్దాం...ముందు వక్కసారి వీళ్ళ జాతకాలు చూద్దాం రండి...

రాజ—ఏమో! ఏ జాతక మెట్లావున్నా సరే. నాఉద్దేశ్యం చెప్పేశాను.

సా—అబ్బా! నిశ్చయాలు నిమ్మదిగా చేద్దాం. రండి చెప్తా. ఒక్కసారి చక్రం వేసి చూద్దాం.

(సాముద్రికుడు, రాజగోపాలాన్ని తీసుకు వెళ్తాడు. వాణి దుఃఖిస్తూ కూర్చుంటుంది వేణు—వాణి దగ్గరకొచ్చి)

వేణు—వాణీ!

వాణి—మామయ్యా!

వేణు—ప్రసాదంటే నీ కిష్టమేగా?

వాణి—ఆ, కాని ప్రసాదుకు నేనంటే......

వేణు—ప్రసాదును నే నెల్లాగయినా నప్పిస్తాను, వప్పించే పెళ్ళిచేస్తాను. దానికోసం నువ్వు బెంగ పెట్టుకోవద్దు... అమ్మతోగూడా ఈ సంగతి చెప్పు. మరేం ఫర్వాలేదు. నే నిప్పుడే అల్లా వెళ్ళివస్తాను. బాధపడకండేం?

[వేణు బయటకు వెళ్తాడు, వాణి ఏడుస్తూ కూర్చుంటుంది కళ నారింజరసం గ్లాసుతో వచ్చి]

కళ—వాణి...అమ్మా...ఇందు...నారింజ రసం...తీసుకో.

వాణి—తాగుతాలే? ఇంకా మామూలు వేళ కాలేదుగా.
కళ—వేళ అయింది తల్లీ; అన్నింటికీ వేళ అయింది. (తాగకుండా వణికిపోతున్న చేతుల్లో నారింజరసం గ్లాసు అందిస్తుంది)
వాణి—అల్లా వణికి పోతున్నావేమే!
కళ—ఏం లేదే; వాణీ.....నన్ను మాట్లాడించి మరీ బాధ పెట్టకు...తొందరగా ఈ రసం తీసుకో.

(గ్లాసు వాణిచేతికిచ్చి వెళ్ళబోగా)

వాణి—అమ్మా! (కళ ఆగింది) మామయ్య బావ నల్లా గయినా వప్పిస్తానన్నాడు. తప్పకుండా వప్పిస్తానన్నాడు. నిన్నూ, నన్నూ, నాన్ననూ ఏం బాధ పడొద్దన్నాడు.
కళ—ఎందుకమ్మా? ఎవరు బలవంతాన వప్పించినా, ఇష్టం లేనివాణ్ణి చేసుకుని జన్మంతా బాధ పడటమెందుకు? అందుకనే బాధలేని పద్ధతి ఆలోచించాం....త్వరగా రసం తీసుకో తల్లీ... (వెళ్ళిపోతుంది)

[వాణి నారింజరసం తాగబోతుండగా రెండవ ప్రక్క గదిలోంచి ప్రసాదు ప్రవేశిస్తాడు]

ప్రసా—కనక.. కుట్ర పూర్తయిందన్న మాట.
వాణి—ఆ!! (తెల్లబోయి నుంచుంటుంది)
ప్రసా—నే వద్దన్నా, మెడలు వంచి నన్ను నా కంఠానికి వేలాడదీస్తారన్న మాట.
వాణి—బావా!
ప్రసా—నోరుముయ్. నా జీవితానికి చీడ పురుగులా పట్టుకు వదలకుండా పాట్లు పెడుతున్నావ్. దీనికి తగిన సమాధానం నాకు తెల్సు.

వాణి—అక్కా నేను. నీ కిష్టం లేకపోతే మానెయ్యి. బలవంతపు పెళ్ళి నాకూ వద్దు.

ప్రసా—అక్కాలేదంటే ఎల్లాగో అల్లా నచ్చచెపుతారు. తల వంచి నప్పుకునేదాకా అందరూ కల్సి నా ప్రాణాలు కొరుక్కు తింటారు. అందరి చేతులూ కల్సి నా తల వంచుతాయి గాని మనసు నొంచలేవు. పెళ్ళికి నే నొప్పుకుంటాను. పెళ్ళి చేసుకుని నీ ప్రాణాల్ని నలిపి వేస్తాను. నీ జీవితంలో ప్రతిక్షణం నరక లోకం చేస్తాను, చూసుకో.

వాణి—వద్దు. అక్కా లేదు. మా అమ్మ ఏ బాధ లేని పద్ధతి ఆలోచించింది.

ప్రసా—వేరే పద్ధతేముంది? ఎక్కడా సరైన సంబంధం రాదనేగా నా కంటగట్టి తలపెట్టారు! ఇక వేరే ఏముంది?

వాణి—బావా! కక్ష సాధించటానికి నన్ను పెళ్ళిచేసుకోవద్దు. నా మీద, అమ్మమీద జాలిపడితే పెళ్ళిచేసుకో. లేకపోతే వద్దు!

ప్రసా—జాలి! నీమీద నాకెందుకు జాలి?

వాణి—నామీద జాలి లేకపోవటానికి కారణం ఏమిటి బావా? నేనేం తప్పు ఏం ద్రోహం చేశానని జాలిలేదు? నేనంటే నీకు జాలి లేదు. నే నంటే పెద్దవాళ్ళకూ జాలి లేదు. తాతయ్య మనసులో ఏముందో! పుట్టకముందు నే నాయన కేం ద్రోహం చేశానో! మన మిద్దరం సమంగా పుట్టాం నీ కేం ద్రోహం చేశా న్నేను?

ప్రసా—ద్రోహం వేరే చెయ్యాలా? నా కోరిక కడ్డం రావటం చాలదూ.

వాణి—నీ కోరికకు నే నెప్పుడూ అడ్డం రాలేను బావా! నే నెవరికోరికకు అడ్డం రాను. నా కోరిక నేను చంపుకునైనా సరే, మీ అందరి కోరికకు అనువులర్పిస్తాను. తాతయ్యకు నే నంటే తగని అసహ్యం నేనంటే! నాతండ్రికి తలవంపు, కన్నతల్లికి కన్నీళ్ళు. ఇక నేను బ్రతికి ఏం ప్రయోజనం. ఇంతమంది కలిసి ఇంతగా ఆలోచిస్తున్నారు గాని ఒక్కరైనా నాకూ మనసు వుందనిగాని, కోరికలున్నాయని నేనూ ఒక మనిషిననీ గాని ఆలోచిస్తున్నారా? ఆఖరికి అమ్మయినా ఆలోచించిందా? ఇంత మంది బాధా ఈ గుక్కెడు ప్రాణంతో వదలి పోతుంది. బావా...అదీ తొందరగానే తెమిలి పోతుంది.

ప్రసా—అయితే మంచి మనువు దొరక్కపోతే ఆత్మహత్య చేసుకుంటానంటావా!

వాణి—మంచి మనువు కాదు బావా, మనసున్న మనువు.

ప్రసా—అయితే! ఎవర్నైనా ప్రేమించావా.

వాణి—ఆ...

ప్రసా—ఎవరిని ప్రేమించావ్! చెప్పు వాణీ...మాట్లాడ వేం! నీకొక్కావల్సిన ఉపకారం నే చేస్తాను. ఎవరో చెప్పు.

వాణి—నాకుపకారం చేయటం, నీ పీడ వదిలించుకోటాని కేగా?

ప్రసా—కాదు. నాకు నువ్వంటే అసహ్యంలేదు. నీమీద జాలిలేక కాదు. వాళ్ళందరూ నన్నడక్కుండానే పెళ్ళి నిశ్చయిస్తుంటె, అందరిమీదా కోపం, నీమీదాకూడా చూపించాను. అంతే! చెప్పు. నీకేది కావాలంటే అది చేస్తాను. ఎవరిని ప్రేమించావ్.

వాణి—ప్రేమించాను, ప్రేమించి లాభ మేమిటీ?

ప్రసా—లాభ మెందుకులేదు ? నిజంగా నిష్కల్మషంగా ప్రేమించి వుంటే లాభ మెందుకులేదు! ఎవరు కాదని తోసివేస్తారు ?

వాణి—నువ్వే... బావ... నువ్వే తోసి వేస్తున్నావ్ గూడా.

ప్రసా—వాణీ!...

వాణి—నన్ను క్షమించు, బావా...

(ప్రసాద్ అట్లాగే నుంచోని పోయాడు)

వాణి—నాతప్పులన్నీ క్షమించు. నాపుట్టిన దోషం నన్నొదిలి పెట్టకపోతే, తన్నిపారెయ్యి. నాకు తగని కోరిక నేను కోరుకుంటే కంఠం పిసికిపారెయ్. నామనసులో దాగి వున్నదంతా చెప్పేశాను. కూర్మిచూపెడతావో? కూలతంతావో తేల్చిచెప్పు. కమలాకరంగారి కూతుర్నే ప్రేమించి, నా ఆశలన్నీ రాల్చివేశావ్. ఇకనువ్వువద్దన్నా వాడిపోయే ఆశలేవీ లేవు. తేల్చి చెప్పుబావా! మనసు యిస్తావో, మరణించమంటావో చెప్పు.

ప్రసా—వాణీ! నేనిదంతా ఆలోచించలేదు. అంతా మళ్ళీ ఆలోచిద్దాంలే.

వాణి—తిరిగి ఆలోచిస్తావా! ఆ ఆశతో బ్రతకమంటావా!

ప్రసా—ఇంతవరకూ నేనేవో కలలు కంటున్నమాట నిజమే. కాని వాణీ, ఇక మీ అందరి ఇష్టమే నాయిష్టం.

వాణి—బావా!

ప్రసా—ఆ! ఇక అంతా మరచిపో! ఆ నారింజరసం తీసుకో. వెళ్ళి మీ అమ్మతో నాన్నతో అందరితో యీసంగతి చెప్పు.

వాణి—బావా!

ప్రసా—ఇందర్ని కష్టపెట్టటంసంగతి అట్లావుంచి, జీవితాలే తారుమారై పోతున్నప్పుడు తొందరపడకూడదు. నీనోటి దగ్గిర నారింజరసం ఆపాను. నారింజరసం తీసుకో ముందు.

వాణి—బావా...ఇంద బావా? నువ్వూ తీసుకో బావా.

ప్రసా—అహ, వద్దులే.

వాణి—వద్దనకు బావా; నువ్వూతీసుకో. ఇద్దరంతీసుకుందాం. (వేరే గ్లాసులో పోసియిస్తుంది ఇద్దరూ చెరోగ్లాసులో నారింజరసం త్రాగుతూ)

ప్రసా—(త్రాగుతూ) బాగుంది. వాణీ, కాలంపండి కన్ను మూసేంతవరకూ ఇద్దరం కలిసేవుందాం. అయిపోయిందంతా మర్చిపో. అందరికీ చెప్పు, అంతామర్చిపొమ్మని. అందరికీ చెప్పు.

వాణి—చెప్తాను. చెప్తానుబావా. చెప్తాను (సంతోషంగా ఒకరినొకరుచూసుకుంటూ ఇద్దరూ చెరిఒకవైపు వెళ్తారు—

వాణి—బావా! (ప్రసాద్ ఆగాడు)

ప్రసా—(వాణివంక తిరిగి) పాపం నా వల్లనే వాళ్ళు బాధ పడ్డారు. ప్రాణం వదిలారు.

వాణి—అంతేకాదు బావా!...సగం ..సగం...కూడా విషం......తాగాం.

ప్రసా—ఆ!!

వాణి—ఆ నారింజరసంలో విషం వుంది.

ప్రసా—నీ కెట్లా తెలుసు!

వాణి—అమ్మ వ్రాసిన వుత్తరంలో వుంది. అమ్మే నాకు రసంలో విషం కలిపి యిచ్చింది.

ప్రసా—ఆ!...

వాణి—పద, బావా, తొందరగా పదన్నా విరుగుడు తీసుకో. ముందు. పద బావా...తొందరగా...

ప్రసా—(మాట్లాడకుండా నిలబడిపోయాడు)

వాణి—బావా...బావా (వణికిపోతూ అంటుంది.)

ప్రసా—నాకళ్ళు...కళ్ళు తిరిగిపోతున్నాయి.

(ప్రసాద్ కూలబడిపోయాడు)

వాణి—(కెవ్వున కేకవేసి పడిపోయింది)

[సాముద్రికుడు ప్రవేశించి]

సాము—ఏమిటమ్మా...ఏమిటిది? ప్రసాదిట్లాపడిపోయాడేం!

వాణి—(నిమ్మదిగా లేచి) నారింజ రసంలో విషం వుంది. తెలియక ఇద్దరం తాగాం.

సాము—ఆ !—

వాణి—మా పెళ్ళి...అయిపోయింది.

సాము—వాణీ !......

వాణి—మా పెళ్ళి అయిపోయింది. [కూలిపోయింది]

సాము—వాణీ! (కూలిపోయిన వాణి దగ్గర చేరాడు)

వాణి—పెళ్ళి అయిపోయింది. (వాణి కన్ను మూసింది. సాముద్రికుడు ఆ కళేబరం చుట్టూ తిరుగుతూ)

సాము—వాణీ ! ...ప్రసాద్...ప్రసాద్... వెళ్ళిపోయావా ప్రసాద్.

[సాముద్రికుడు ప్రసాద్ మీద పడి దుఃఖిస్తూండగా... రాజగోపాలం, వేణు లోపల్నించి వచ్చి]

వేణు—ఏమిటండీ...ఇదీ ?...

రాజ—ఇద్దరూ పడిపోయారేం ? ఏం జరిగింది ?

సాము—ఇంకా ఏం జరగాలి ? పెళ్ళిద్దరూ కూడా విషం తాగారు బాబూ! వక్క-సారి పలుకరా బాబూ! ఒక్క-సారి 'తాతా' అని యీ ముసలివాణ్ణి సంతోషపెట్టు నాయనా !

రాజ—బాబూ...(నిస్తబ్దుడై ఆగి కూలిపోతాడు)

వేణు—(ఇద్దరివంకా చూసి తేలిగ్గా నవ్వుతాడు)

సాము—నలుగురూ వెళ్ళిపోయారు. అందరూ వెళ్ళిపోయారు. బాబుకూడా వెళ్ళిపోయాడు. అంధకార బంధురమయిన ఈ జీవితానికి వెలుగునిచ్చి, ఈ భూతలాన్ని స్వర్గంచేసి చూపించిన 'మహిమ' మాయమైపోయింది.

వేణు—తాతగారూ!

సాము—ఓ! భగవంతుడా ఇట్లా పరీక్షించి బాధ పెడ్తావేం తండ్రీ?

వేణు—తాతగారూ?

సాము—ఆశలు రేకొల్పి భంగపుచ్చుతావేం ప్రభూ!

వేణు—తాతగారూ! వూరుకోండి.

సాము—నన్నోదార్చకు వేణూ! ఈకంట్లో కన్నీరిగిరిపోయే వరకూ, కడుపంతా ఎండిన చెరువై పోయేవరకూ, నన్ను మాట్లాడించకు.

వేణు—అయ్యయ్యో! అన్ని మమకారాలూ వదిలివేసిన మీరే అట్లా అంటే ఎట్లా? నామాట వినండి.

సాము—ఇంకేం మాటలు నాయనా! ఎండి ఎడారి అయిన ఈమనసులో ఆశలు చిగిర్చిన పసివాడు ఆరిపోయిన తర్వాత ఇంకేంమాటలు?

వేణు—భగవన్నిర్దేశం అది. మనమేం చేయగలం? వాళ్లు వెళ్ళారు. మనం మిగిలాం.

సాము—మిగిలాం! ముగ్గురం మిగిలాం! ఈ ముందున్న అంధకారంలో తడుముకుంటూ ముందుకుపోయి ఎక్కడో, కాలుజారి కూలిపోవటాన్కి ముగ్గురం మిగిలాం.

వేణు—అంతే మరి. ఇవి మధ్యవచ్చిన మమకారాలు! అన్నీ తెలిసిన మీరే ఇట్లా దుఃఖిస్తే ఎట్లా? మరచిపోయారా "పద్మపత్రమివాంభసా". ఈ సుఖం దుఃఖం మనల్ని

అంటూకుండా ఉన్నన్నాళ్ళూ గడిపివేయాలిగదా. పద్మ పత్రం ఎలాగూ వాడిపోయింది. మాడి రాలిపోయేవరకూ నిరీక్షిద్దాం. లేవండి. (దూరాన పద్మ కంఠస్వరం వినిపిస్తుంది.)

1. నిర్మానమోహా జితసంగదోషాః
అధ్యాత్మ నిత్యావిని వృత్తకామాః
ద్వంద్వైర్విముక్తా స్సుఖ దుఃఖసంజ్ఞై
ర్గంచ్ఛం త్య మూఢాః పద మవ్యయం తత్.
(5 వ అధ్యాయం 15 శ్లోకం)

2. యథా నదీనాంబ హహోంబువేగా
స్సముద్ర మే వాభిముఖా ద్రవంతి
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రా ణ్యభి విజ్వలంతి.